శ్రీరస్తు.

# వైజయంతీవిలాసము

అను నామాంతరముగల

## శ్రీవిప్రనారాయణచరిత్రము.

---

సారంగు. తమ్మయప్రణీతము.



**SCHOLARS' EDITION.**

*(For Private Circulation Only.)*

చెన్నపురి :

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచే

ముద్రితము.

1909.

# భూమిక.

ఈవైజయంతీవిలాసమునకు విప్రనారాయణ చరిత్ర మనియుఁ బేరుగలదు. ఇందలి కథానాయకుఁడు వైష్ణవబ్రహ్మచారి. వీనికి నరవములోఁ దొండరడిప్పొడియాళ్వారు (అనఁగా భక్తుల పాదధూళి.) అనివాడుక. ఈతఁడు కావేరియొడ్డున నుండెడి శ్రీరంగములో నుండువాఁడు. తనతోటలోని తులసిని బూలను మాలలుగాఁ గూర్చి స్వామికిసమర్పంచుచుండుటయు నందు మాధుకరము చేసి జీవించుచుండుటయు నీతనివృత్తి. మధురవాణి, దేవదేవి యను నిద్దఱు వేశ్యలొకనాఁడాతోట దరినుండిపోవుచు నిష్ఠాగరిష్ఠుండైన మనకథానాయకునింజూచి భక్తితో మ్రొక్కుటయు నాతఁడేమియు ననక యూరకుండుటయు నందుకై దేవదేవి "మన మ్రొక్కునందుకొని దీవింపక మోము వంచుకొనిపోవుచున్నాఁడే వీని కేల మ్రొక్కితిమి" అని విసువుటయు నక్కయగుమధురవాణి యాతనివైరాగ్యము స్వామిభక్తి మొదలగువానిని గొంత కొనియాడుటయు దేవదేవి వీనిని విటశిఖామణినిఁగాఁ జేయవచ్చుననియు మధురవాణి యట్లు చేయుటకు సాధ్యపడఁదనియు నట్లుచేయ లేనిచో నేను వేశ్యావృత్తి వదలుకొని నీకు దాసినగుదు ననిదేవదేవియు, నట్లుచేయఁగలిగితివేని నీకు శిష్యురాలు నగుదు నని మధురవాణియుఁ బ్రతిజ్ఞలు పట్టుటయు దేవదేవి వేశ్యావేషము వదలి భక్తురాలివేషము ధరించి యాతనియొద్దకుఁ బోయివిరక్తినొందినదానివలె నటించి తనవృత్తిని నిందించుచు నావటుని సేవించి సేవించి తుద కాతనిచిత్తమును స్వాయత్తము చేసికొని మెల్లమెల్లఁగాఁ దనయింటికిఁ దెచ్చి విటులకు

జరుగు మర్యాద లన్నియుఁ జేయించి తనప్రతినను నెరవేర్చు కొని చల్లచల్లఁగాఁ దల్లిచే నిల్లు వెళ్ళఁగొట్టించుటయు నాతఁడు తదధీనమానసుఁడై దుఃఖించుచుండ, స్వామి శిష్యవేషమున బంగరుగిన్నె దెచ్చి యిచ్చిన మరల నాతని రప్పించుటయు నంతట రాజభటులు పట్టుకొనుటయు వటువిటుని శిక్షింపఁ బోఁగా భగవంతుఁడు ప్రత్యక్షమైతప్పించి యచ్చుటవైష్ణవులచే బ్రహ్మరథంబు పట్టించుటయు మొదలుగాఁగలకథ యిందెంతయు మనోహరముగా నాలు గాశ్వాసములలో వర్ణింపఁ బడినది.

ఇట్టి మృదుమధుర ప్రబంధమును వ్రాసినకవి సారంగు తమ్మయ్య. ఈతఁడు భారద్వాజసగోత్రుఁడు. ఆపస్తంబసూత్రుఁడు. నియోగిబ్రాహ్మణుఁడు. ఇంటిపేరు సారంగువారు. ఈతనితాత తాత సారంగధరుఁడు. వానిభార్య గంగమ్మ. తాతతండ్రి గిరిమంత్రి. వానిభార్య చంద్రమ్మ. తాత తిమ్మన్న. వానిభార్య తిమ్మాయమ్మ. తండ్రి నరసయ్య. పెదతండ్రి గిరిమంత్రి. తల్లి అక్కమ్మ. అనంతన్న, వెంకటాద్రి సహోదరులు. ఈతనిగురువు కందాళ అప్పలాచార్యులు. ఇక్కవి మహమ్మదుశాహి గోల కొండ నేలుకాలములో గొప్ప యైశ్వర్యము ననుభవించుచు గోలకొండలోననే కరణీకము చేయుచున్నట్లు వీరికవలనఁ దెలి యుచున్నది. ఈగ్రంథమును శ్రీరామున కంకితము చేసెను. ఇంపలికవిత్వమంత సలక్షణమైనది కాకున్న నేమిగాని చదువు వారికేమి వినువారికేమి యింకను జదువ వలయుననియు విన వలయుననియు నుండక మానదు.

చెన్నపురి.

ఇట్లు,
వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్.

శ్రీ ర స్తు.

# వైజయంతీవిలాసము

## విప్రనారాయణచరిత్రము.

---

### పీఠిక.

ఉ. శ్రీవసుధాసుతాంఘ్రి వివరింప శిరీషదళోపమాన మీ
క్ష్మావరు కేల న్నిసర్గగుణకర్కశ మశ్మము మెట్టఁ బల్కె నె
ట్లీవసుధామరుం డనుచు నింతులువల్కఁగ సంటఁగొంచులో
కావనుఁ డైన పెండ్లికొడు కస్మదభీప్సితముల్ ఘటించుతన్.

చ. జను లరుదంద నాఘనుఁడు చాపలతం దరియంగఁ జూచిలో
నినిచినకూర్మి నీడలను నెమ్మి రహిం న్బరి విప్ప నయ్యెడం
గనుఁగొనువారికి న్గలిగె గన్నులపండు వటంచు నెచ్చెలుల్
ననువులు వల్కఁగన్గొనలనవ్వు ధరాసుతమమ్ముఁ బ్రోవుతన్.

చ. మిహిరతనూనపాద్ద్యుతుల మించి సముంచదుదారశక్తిచే
బహిరబహిస్తనుస్తతులఁ బాపుచు శేషశయానుకార్యని
ర్వహణసమర్థ మై యతిపరంపరఁ బెం పెసలార్చునమ్మహా
మహము సుదర్శనం బెపుడు మత్కృతిఁ గూర్చుఁ బ్రసన్న
[భావమున్. 3

క. అమరఁగ నేఘను శేష
త్వమునన్ శేషిత్వసార్థతం బరగును ద
త్కమలాక్షుం దట్టి సహా
స్రముఖుండు వహగపరంపర లక్కృపసేయన్. 4

## వైజయంతీవిలాసము

శా. దాసుండై సఖుఁడై తురంగమయి చిత్రచ్ఛత్రమై మేలుక
ట్టై సింహాసనమై సుమవ్యజనమై యంకోత్తమంబై రమో
ల్లాసిన్ జేరి భజించు వేదమయుఁ గల్యాణప్రదు న్స్త్రీరము
ద్రాసీమంతవతీమనోహరు గరుత్మంతుం బ్రశంసించెదన్. 5

ఉ. వేత్రలత న్ధరించి యరవిందభవాండచరాచరావలు
ల్చిత్రగతి న్నటించుటకు శిక్ష యొనర్పఁగ సూత్రధారుఁడై
మిత్రశశాంకలోచనుఁడు మెచ్చఁబరాంకురవృత్తిఁ జెందుమా
సూత్రవతీశుచేఁ గవిత చొప్పడుఁగాత నిరంతరాయమై. 6

ఉ. మంజుతరోష్ఠబింబము సమంచితదాడిమబీజపంక్తిలే
కం జవిఁ జూచి పల్కుచిలుక న్ప్రియము ల్చినుక న్జతుర్ముఖీ
పంజరపాలిక న్బెనుచు ప్రౌఢవినోది ఘటించుఁ గావుతం
గంజభవుండుమత్కృతిముఖంబున విశ్వజనప్రమోదమున్.

శా. వీణాతంత్రలసద్గుణంబులు ముదావిర్భావముల్ జేయఁగాఁ
బ్రాణంబు న్బలెఁబొమ్ముడించుక సుధాప్రాయానులాపంబుల
న్వాణిన్ గూర్చుచు సారెసారెకుదుచుల్వాటింపఁబల్కించున
వ్వాణీదేవి నటించు మద్విమలజిహ్వారంగమధ్యంబునన్. 8

ఉ. మాటికి నిష్కళంకముఖమండలిఁ జంక్రమణంబుఁ జూచి చె
ల్వేటిది యంచు గౌరి చలియింపఁగఁ దన్మృగడింభము న్జటా
జూటతలంబున న్బొలుచు సోమునిఁ జూపి సుధాశగొల్పుచు
న్బోటిని వేడు నగ్గిరివిభుండు కృప న్మముఁ బ్రోచుఁగావుతన్.

ఉ. ఏదనువిచ్ఛిఖామణులహీనశయానుఁ బ్రపత్తిభాసనా
స్వాదము గ్రోలుచున్ మలయశైలమరుత్తులు తేఁటిరీతి స
శ్రీదయితంబుగా సహచరిష్ణువుఁ జేయుదు రట్టియాదిమ
ద్వాదశసూరివర్యులపదంబులు మానసపీఠిఁ గొల్చెదన్.

క. వందారుదాసజనతా
మందారు న్వేదశాస్త్రమహితప్రజ్ఞా
బృందారకగురుమద్గురుఁ
గందాళప్పలగురు న్జగద్ధితుఁ గొలుతున్. 11

క. జాతులవార్తల నుపమల
రీతులఁ బదబంధముల ధరిత్రీతలవి
ఖ్యాతిగఁ గృతు లొనరించుపు
రాతననూతనకవీశ్వరావళిఁ గొలుతున్. 12

క. గణశుద్ధియు గుణశుద్ధియు
గణుతింపఁగ లేనివారు కవిత లటంచు
న్గణములు దెలుపుకొనంగా
గుణదోషము లెంచ నేల కుకవులయందున్. 13

వ. అని ప్రధాన దేవతానమస్కారంబును, సముచితేతరపురస్కారంబును, నిజగురువందనంబును, సుకవివందనంబును, కుకవినిందనంబును గావించి మదీయవచోవిశేషంబుల రఘువంశవల్లభునిఁ బొగడ న్దలంచినవాఁడ నై తదీయదాస్య విహితప్రచారం బగు మదీయవంశప్రకారం బభివర్ణించెద. 14

## కవివంశానుక్రమణిక

మ. ఇల శ్రీరామున కేమహర్షి వనిలో నిష్టాప్తిచే రాకపో
కలఁ బ్రేమ న్ఘటియింపఁ బర్వతము లై కన్పట్టుప్రామిన్కు
లా,మలకంబు ల్బలెఁ గేలఁ గై కొనియె నమ్మౌనీంద్రుఁడానిష్ఠు
రో, జ్జ్వలదుర్లోక మహాస్సమాజుఁడు భరద్వాజుండు తాఁ
[బెంపగున్. 15

వ. ఆఋషిమిత్రపవిత్రగోత్రంబున. 16

క. శ్రీరంగహిమవదంతర
భూరంగత్కీర్తి యగుచుఁ బొగడత కెక్కెన్
సారంగధరుఁడు నిర్జిత
సారంగధరుండు కీర్తి సర్వజ్ఞుఁ డిలన్. 17

క. సారంగధరుఁడు వెలయుఁగ
సారంగునివా రటంచు సచివాగ్రణు లై
పేరుం బెంపును గాంచి రు
దారత నయ్యభవు లనఁగఁ దద్వంశభవుల్. 18

శా. ఆసారంగధరుండు గంగ యను భార్యారత్నముం బెండ్లియై
వాసి న్వన్నెయు రా మెలంగి కనియె న్వంశావను న్పావను
న్భాసన్మార్గణకావతంసనిరతాభ్యర్థితనానాకళా
ధీసంధానను రేంద్రమంత్రిగిరిమంత్రిన్మంత్రిమందారమున్.

క. గిరిమంత్రిమౌళి చంద్రమ
తరుణీమణియందుఁ గనియె దానకళాభా
స్కరతనయుని ధరఁ దమ్మన
ధరధైర్యు సమానశౌర్యుఁ దతగాంభీర్యున్. 20

మ. అనఘుం డాగిరిదండనాయకునితమ్మామాత్యు సద్దానసం
జనితోదారయశోవిలాసములు నిచ్చల్ గేరు మందాకినీ
ఘనసారామృతహారహీరసురరాడ్గాంధర్వగంధేభచం
దనమందారసుధాంశుబింబములయందంబుల్ వినిందించు
[చున్. 21

ఉ. తమ్మనయంబుఁ బ్రోచుటకు దారుణి బంధులు బంధుపారిజా
తమ్మన రామభక్తిఁ గని తార్కికు లెల్లను వీని దార! చి

త్తమ్మనఁ జూపులం దనిసి ధార్మికు లీతని దెంతమంచివ్వ
త్తమ్మన.నాగిరిప్రభుని తమ్మన మించె నుదంచితస్థితిన్. 22

ఆ. తమ్మమంత్రి గాంచెఁ దిమ్మాయియందు నం
దనులశౌర్యసింహు నారసింహుఁ
జతురబుద్ధిచంద్రు సత్కళాగుణచంద్రు
గిరిచమూవరేంద్రుఁ గీర్తిసాంద్రు. 23

వ. అక్కుమారరత్నంబులయందు. 24

క. సారంగుతమ్మమంత్రికు
మారుఁడు నరసింహమంత్రి మహి రహి కెక్కెన్
ధారాళదానశమదమ
పౌరుష గాంభీర్యధైర్యపటుశౌర్యములన్. 25

సీ. ఏమంత్రిదాతృత్వ మినతనూభవకల్ప,
భూజాతమేఘుల కోజబంతి
యేమంత్రి మతిలీల యిభవక్త్రషణ్ముఖ,
స్వరధీశ్వరులమనీషలకు సాటి
యేమంత్రిసత్కీర్తి హిమశైలకైలాస,
పర్వతేంద్రులకు సౌభాగ్యధాత్రి
యేమంత్రివిక్రమం బింద్రనందన భీమ,
చర్యలకును నతిస్మారకంబు
తే. పరగ నేమంత్రి తేజంబు పద్మమిత్ర
భానుభవఫాలలోచన ప్రభల కుద్ది
యతఁడు బుధబంధులోకసన్నుతికిఁ దగఁడె
మంత్రికులహేళి నరసింహమంత్రిమౌళి. 26

క. సారమతి యానృసింహుఁడు
వారాశిగభీరుఁ డతులవైభవమున గౌ
రీరమణి నీశుఁడుం బలె
నారూఢాన్వయ వరించె నక్కమసాధ్విన్. 27

సీ. ఆక్రాంతశాంతిదాంత్యాతులవర్తనముల,
నల యరుంధతిసాటి యక్కమాంబ
కళ్యాణరూపసౌశీల్యలక్షణముల,
నవనిపుత్రికపోల్కి యక్కమాంబ
ప్రణుతపాతివ్రత్యగుణవైభవంబున,
ననసూయ పెన్నుద్ది యక్కమాంబ
యతిథిసంతర్పణవ్రతవిధానంబుల,
నన్నపూర్ణకు జోక యక్కమాంబ
తే. యనఁగ లక్ష్మీకటాక్షవీక్షానులబ్ధ
సకలసంపత్సమృద్ధిచే జగతియందుఁ
బొగడఁ దగు నన్నదాదికపుత్రజనని
హరికృపాలంబ నరసయ్యయక్కమాంబ. 28

చ. అనఘుఁడు తన్నృసింహవిభుఁ డాసతి యక్కమయందుఁ గాంచె ముం, దనుపమవర్తనుం డగు ననంతనమంత్రిశిఖావతంసమున్, ఘనుఁ డగు వేంకటాద్రిగణకప్రభుసన్నుతు నాసహోదరుల్, చనువున వామదక్షిణభుజంబులుఁ బోలె [సహాయులై తగన్. 29

చ. ఇనసమతేజు లౌనృపులు నెల్ల మహమ్మదుశాహి యేలు నీ
యెనుబది నాల్గుదుర్గములఁ జేలిన యేలిక గోలకొండఁ ద

ఘ్నసనగరస్థలిఁ గరణికం బొనరించెడుఁ దమ్మమంత్రి యా
జనపతి ధర్మ్ము పొమ్మనఁ బ్రజల్ జయవెట్ట గృహస్థులోననన్.

వ. అట్టివంశంబున మహోన్నతుండ నై వివిధభోగంబు లను
భవించుచునుండ నొక్కనాఁడు. 31

సీ. రవికోటిరుచి పెంపు రవణించుమణికిరీ,
టంబువాఁడు సులలాటంబువాఁడు
ప్రతి లేక తను జోక భాసిల్లుసిరి పేరి,
జోటివాఁడు సువర్ణశాటివాఁడు
కరుణారసము మించు కమలాలి వర్షించు,
చూపువాఁ డెన లేని రూపువాఁడు
పలువన్నియల మించు దులకించుడాయూపు,
వింటివాఁ డభ్రంబువంటివాఁడు

తే. నగుమొగంబున నెలవంక నలిక మయిన
తిరుమణి ధరించువాఁ డొక్కదివ్యపురుషుఁ
డెదుట నిలుచుండి నా పేర నీవు సేయు
కావ్య మంకిత మొనరింపు భవ్యసరణి. 32

క. అని పల్కునంతలో మే
ల్కని నలుదిక్కులును గలయఁ గన్గొని స్వప్నం
బునఁ గులదైవము రఘుపతి
నను భవ్యునిఁ జేయ వచ్చినాఁ డను తెలివిన్. 33

వ. ఆహా! మత్పురాకృతసుకృతపరిపాకం బతిమధురమధుర
సాస్వాదనంబున చెగటు పడునతండు కట్ఠాద్యాదికంబు
రుచి గొనుచందంబునఁ బురాతన ప్రాచేతసముఖ్యమహా
కవివచస్సుధార్ణసంబులు గ్రోలు వీనుల శ్రీ రామచంద్రుండును

మదీయాల్పసారవాక్యంబు లానుటకు నుత్సహించెఁ గృ
తార్థుండ నైతి నని యమ్మహానుభావునకు. 34

—షష్ఠ్యంతములు.—

క. సుభగనిజపాదుకాఖ్య
ప్రభులంబనభూరిరాజ్యపదభరతునకున్
సభయశరణాగతామర
శుభరతునకు నతులసద్యశోభరితునకున్. 35

క. ఫేకరదిక్తటకరటిఘు
టాకటనిర్భ్యనచాపటంకారునకున్
భూకాంతాపీఠభ్రాడ్
జ్యాకిణకర్కశభుజావిటంకారునకున్. 36

క. ఖలతాటకావిపాటన
బలదర్పితసన్మహర్షి భావితరక్షః
కులహింసాపేతునకును
జలనిధివైకుంఠతులితసాకేతునకున్. 37

క. రక్షోగణవిక్షోభణ
దక్షోద్భటబాణధాళధళ్యాహతదృ
గ్రక్షోదివాంధపక్షున
కక్షీణవచోనుదక్షవాస్రాక్షునకున్. 38

క. శ్రీమహిళామూర్త్యంతర
భూమిసుతాయోగయోగ్యభువనాద్భుతరే
ఖామంగళాంగజితసు
త్రామమణిస్తోమునకును రఘురామునకున్. 39

వ. సమర్పణంబుగా నభ్యుదయపరంపరాభివృద్ధిగా నభిమతార్థ
సిద్ధిగా నే రచియింపం బూనిన వైజయంతీవిలాసంబునకుం
గథాక్రమం బెట్టిదనిన. 40

## కథాప్రారంభము.

### శ్రీరంగపురవర్ణనము.

సీ. నిలిచె నేరాజధానిఁ బయోరుహాసను,
సజ్జపూజ నసంతశయనమూర్తి
చెందె నే కటకంబునందు సంతతసర్వ,
పరిపూర్తితోఁ దత్త్రిపాద్విభూతి
పుట్టె రేపట్టణంబునఁ దృణద్రుమలతా,
మూర్తులై తన్నిత్యముక్తవరులు
ప్రవహించె నేవీటఁ బరిఖావిభూతి న,
వ్విరజాస్రవంతి కావేరిపేర
తే. వేదశృంగంబు నోంకారవిగ్రహంబు
నైన శ్రీరంగదివ్యవిమానరాజ
మెచట నివసించె నిల దాని నెన్నఁ దరమె
పుణ్యనికరంబు శ్రీరంగపురవరంబు. 41

సీ. ఆశించు నెపుడు నత్యాసక్తి నమ్మహా,
నటుఁడు నేనగరిఁ గోణంగి యగుట
వాంఛించు వాగ్విధూవరుఁ డతిప్రేమ నే,
పట్టణంబున మూగబారుఁదనము

కాంక్షించు నింద్రుఁ డుత్కంఠతో నేరాజ,
ధానిలోపల నుపాదానపరత
కామించు దేవర్షిగణము లేపెనుఁబ్రోల,
శ్వపచపక్షిమృగాదిజంతువృత్తి
తే. విరజ కావేరి యై పుట్టి పరిఖ గాఁగ
బరమపదవల్లభుఁడు రంగభర్త పేర
నాయకుఁడుఁ గాఁగ వైకుంఠనగరి తాన
యైన శ్రీరంగపురము శక్యంబె పొగడ. 42

చ. రమణఁ జెలంగు నన్నగరి రంగవిమానశిఖాగ్రరత్నకుం, భ
ములు నిజద్యుతిం బొదువఁ బ్రత్యహముఁ గను హేళి చూచి డెం
దమున సదా చలించు నను దార్ఢ్య రమాపతియే తదేకర
త్నముగ ననంతరత్నతవృథా యనుచుం దదపాస్త తేజుఁడై.

ఉ. ఏతఱిఁ జంద్రపుష్కరిణి నీఁతలు వెట్టుచు వేల్పుమూఁక సు
స్నాతృజనాఘముల్ చనెడు చందముఁ దజ్జలజాతభృంగసం
ఘాతము లుప్పరం బెగయుకై వడియుం గా వివరింప నొక్క తీ
రై తెలియంగ రామి నొకయప్పటికిం బరికించు ఝుంకృతిన్.

తే. సారెసారెకుఁ బౌరకర్పూరగంధు
లాడు కావేరినీటఁ బెంపైన పైరు
పంటధాన్యంబు లచ్చటఁ బండుఁ గానఁ
బుడమిలో వడ్లు కర్పూరభోగు లయ్యె. 45

వ. అందు. 46

సీ. అలికాదికాంగంబు లనుగత శ్రీచూర్ణ,
ధవళోర్ధ్వపుండ్రబాంధవము నెరప

వదనాంబుజములు దివ్యప్రబంధానుసం,
ధానవాసనతోడ నంటు సేయఁ
గంఠదేశంబులు కమలాక్షతులసికా,
మాలికాసౌహార్ద్రలీల నడప
బాహామూలములు శుంభత్సుదర్శనపాంచ,
జన్యలాంఛనమైత్రి సంఘటింప
తే. నాజవంజవభేదమహాభిమజ్జ
దఖిలచేతనసంరక్షణాపతీర్ణ
విష్ణుపర్యాయమూర్తులై పేట నుండ్రు
భాగవతు లాత్మవిద్యానురాగయుతులు. 47

సీ. రమణీయతేజోవిరాజులు రాజులు,
పటుపరాక్రమసముద్భటులు భటులు
నిజబలాధరితదిగ్గజములు గజములు,
హారిణవేగజితార్కహరులు హరులు
వివిధక్రతుప్రీతవిబుధులు విబుధులు,
కవితాభినుతమరుత్కవులు కవులు
రతిరాజకంఠహారమణులు రమణులు,
వరధర్మవర్తకుల్ వర్తకులును
తే. కలిగి కైవల్యఫలదాయకక్షితిధ్ర
భూమిరుహావల్లి యైనయప్పురమతల్లి
విలయమున నశ్వరము గాక వెలయు నరసి
శాశ్వతంబుగ నేలు నధీశ్వరుండు. 48

సీ. విలయసన్న్యగ్రోధదళశాయి శాంబరీ,
బాలకుండు త్రిలోకపాలకుండు

కమలాకపోలకుంకుమపత్త్రరచనావి,
చక్షణుండు గజేంద్రరక్షణుండు
వివిధషోడశసహస్రవిలాసినీమనో,
రంజనుండు నిశాటభంజనుండు
సనకాదిసంయమీశ్వరలోచనచకోర,
చందిరుండు సుధాబ్ధిమందిరుండు
తే. చరణనీరాజనక్రియాచరణకలిత
నముచుమూసఖశతమఖప్రముఖదివిజ
రాజకోటీరకోటీవిరాజితాబ్జ
రత్ననీరాజితవిభుండు రంగవిభుఁడు. 49

తే. ఆమహాదేవు కరుణాకటాక్షవీక్ష
ణప్రభావంబువలన నిజప్రజలకు
దురితరోగాపమృత్యువుల్ దొలఁగి చెలఁగు
పుణ్యరమతల్లి శ్రీరంగపురమతల్లి. 50

మ. వియదధ్వన్యనుతప్రభూతమహిమన్ విఖ్యాతనై తత్పురో
భయపార్శ్వంబుల నప్రయత్నపరిఖాభావంబునం బొల్చున
క్షయపుణ్యాకరవారి వారినిధికిన్ గారాపుదేవేరి వా
గ్దయితాద్రీంద్రకుమారికుంభభవసాక్షాన్నారికా వేరినాన్.

క. ఆసరిదగ్రణికడఁ బెం
పై సప్తశతోర్ధ్వశిఖిధరామరనివహా
వాసంబు మండగుడి యన
భూసురపుర మొకటి వెలయు భూసురపురమై. 52

తే. ఇందిరాసఖుఁ డనుపేర నందు నుండు
నాదినారాయణుండు లోకైకభర్త

ఘోరకలికాలకలుషాంధకారతతులు
పొరయుక్షుండఁ గృపాదృష్టి పరగఁ జేసి. 53

శా. పారంపర్యసమాగతాద్వయమను బ్రహ్మజ్ఞులామ్నాయచూ
డారూఢస్ఫుటశేముషీకు లరిషడ్వర్గోత్థితాతంకధి
క్కారసాంతులు నిత్యభాగవతకైంకర్యానురక్తుల్ నవ
శ్రీరామానుజమూర్తు లప్పురమునన్ శ్రీవైష్ణవాగ్రేసరుల్.

విప్రనారాయణుని చరిత్ర.

వ. అందు. 55

సీ. వేదవేదాంగాదివిద్యాప్రవీణుండు,
పరతత్త్వవిజ్ఞానపారగుండు
నిత్యభాగవతార్చనాత్యుత్సుకస్వాంతుఁ,
డఖిలజీవదయాపరైకబుద్ధి
యతులితైకాదశీవ్రతనిత్యశీలుండు,
ద్వాదశీవాసరోత్సవవిధాయి
యగణితశమదమాదిగుణసంపన్నుండు,
త్రిభువనస్తుత్యనిర్నిద్రయశుఁడు
తే. వంశపారంపరీలబ్ధవైష్ణవాంక
పంచసంస్కారవిభవవిభ్రాజమానుఁ
డాత్మసన్నిహితాది నారాయణాంఘ్రి
యుండు నారాయణాహ్వయుం డొకగృహస్థు. 56

శా. ఆ నారాయణుధర్మపత్నిఁ బతిసేవాలోలసంశీలతా
నూనప్రోద్యదగణ్యపుణ్య నసమానోదారశృంగారలీ
లానిస్సారితవిశ్వలోకమహిళాలావణ్య విస్రాన్వయ
శ్రీనీరాకరలక్ష్మి నెన్నఁ దగు లక్ష్మీనామధేయంబునన్. 57

క. శ్రీరమ్యత నాలక్ష్మీ
నారాయణు లుండ్రు మనుజనారీపురుషా
కారము దాల్చినలక్ష్మీ
నారాయణు లని జగజ్జనంబులు వొగడన్. 58

వ. ఇట్లాదంపతులు కులశీలజన స్తుత్యనిత్యానుకూలదాంపత్యంబులం బ్రవర్తించుచుండ నొక్కనాడు. 59

సీ. మహనీయనలినాక్షమాలికావలయంబు,
కురుబోడితలఁ జుట్టుకొన నమర్చి
శ్రవణాక్షిఖురశృంగసహిత మై కప్పారు,
సారంగచర్మ మంసమునఁ బూని
పృథులసాలగ్రామపేటీసహిత మైన,
కకపాల కక్షభాగమునఁ బాల్చి
కాషాయకౌపీనకలితమస్కరదండ,
కుండికల్ చేదోయిఁ గుదురుకొల్పి

తే. యడుగడుగునకు నారాయణా! యటంచు
నరుగుదెంచెఁ దదీయగేహంబునకును
మాధుకరవృత్తితనుయాత్ర మహిఁ జరించు
యతివరుం డొక్కరుండు మధ్యాహ్నవేళ. 60

తే. వచ్చినయతిప్రవరునకు వైష్ణవసతి
భిక్ష తెచ్చిన నతఁ డామ్రగాక్షిఁ జూచి
యెందు ననపత్యభిక్ష నే నంద ననుచు
నొల్లక చనంగ నతని కయ్యువిద యనియె. 61

వ. మహాత్మా! వైష్ణవగృహంబున దేవపూజానంతరంబుననతిథిభాగంబు విభజించి నాయుంచిన శ్రీవిష్ణుప్రసాదంబుఁబ్రా

కృతాన్నంబునుంబోలె నుల్లంఘింపం దగునే! మీ రెఱుం
గనిధర్మంబునుం గలదె యేతదర్థంబు చిత్తంబునకుం దె
చ్చుకొనం దగిన నతం డది యట్లు కా నిశ్చయించి నెమ్మది సమ్మ
తిలి యమ్మాధుకరంబుం గైకొని చనియె నంత నక్కాంతా
రత్నంబును యతివాక్యంబు మనంబునకు ఘనం బైనఖే
దంబు నాపాదింపం జింతాక్రాంత యై యున్నసమయంబు
నం దదీయభర్త చనుదెంచి తన్మనోవైకల్యంబుం గాంచి
యిది యేమికారణం బనిన నయ్యతివ యతివాక్యం బెఱుం
గించి పతి కిట్లనియె. 62

శా. దౌడ్రాఖ్యాకులమందు నెంచఁదగు సాధుస్తుత్యవంశంబునం
బాడ్రత్వంబునఁ దేజరిల్లు జననంబుం బొందినన్ వేల్పులే
గిడ్రా పోష్యజనాలి కీమె యనుసత్కీర్తిం బ్రదీపించినన్
గొడ్రాలైనవధూటి జన్మ మది పేర్కో నిష్ఫలం బిమ్మహిన్.

తే. దానధర్మము లెన్నిచందములు నైనఁ
దగ నొనర్చినఁ గల్గునే సుగతి జగతి
పారలౌకికవైదికాచారనియమ
కలన గలపుత్రతిలకంబువలనఁ గాక. 64

తే. "దేహి" యని చేయి చాఁచిన దేహి కిడను
మనకు భోగింపఁ దగినజీవన మొసంగి
నందనానంద మిడఁ డాయె నిందిరాధి
పతికి నపచార మేమి చేసితిమొ! కాని. 65

వ. అనిన నయ్యతివకుఁ బతి యిట్లనియె. 66

క. కారణము లేక చెందవు
ధారుణి నాపదలు సంపదలు నిందులకై

యారట వడి సర్వేశ్వరు
దూఱుట గోరుటయు వలదు తోయజనయనా. 67

వ. అని నిజకాంత నూఱడించె నా రాత్రి వేకువ నయ్యిందు
వదన స్వప్నంబున. 68

ఉ. నల్లనిమేను నిల్వుతిరునామము పచ్చనిపట్టు నాభిపైఁ
దెల్లనితమ్మియుం గలుగు దేవుఁడు కుంకుమవన్నెపుల్గురా
బొల్లని నెక్కి నల్పుఁదెలుపుం గలపువ్వులదండఁదెచ్చి యు
త్ఫుల్లనిజాంజలిం జిగురుబోఁడి కొసంగె వెసం గృపామతిన్.

మ. కరుణావారిధి శౌరి దివ్యసుమనోగంధోల్లసన్మాల్య మా
దరణం బొప్ప నొసంగ నప్పుడె యహో తద్వైజయంత్యం
శవి,స్ఫురణన్ గర్భము దాల్చి పొల్చెఁ గడు నప్పూఁబోఁడి
భాస్వద్ద్యుతిన్, హరిణాంకప్రతిపత్కళావహ నశోభాంచ
[త్ప్రతీచీరుచిన్. 70

వ. ఇట్లు గర్భంబుఁ దాల్చి నవమాసంబులు పరిపూర్ణం బైన
యనంతరంబ. 71

క. మాసంబులలోపల నే
మాసము దా ననియె మున్ను మధుసూదనుఁ డ
మ్మాసమున నింద్రదారక
మాసమ యప్పుణ్యవతి కుమారుం గనియెన్. 72

వ. ఇట్లు జన్మించిన యక్కుమారరత్నంబునకుఁ గ్రమంబున
జాతకర్మ నామకరణాదిసంస్కారంబు లొనఁగూర్చి విప్ర
నారాయణాభిధానుం జేసి యర్హకాలంబున నుపనీతుం
గావించిన యనంతరంబున. 73

తే. వేదవేదాంగశాస్త్రాదివిద్య లెల్ల
గురుముఖంబునఁ జదివి తత్పరత నతఁడు
విష్ణుపదభక్తులఁ గని సేవించి పుడమి
నెరఁగు మీపాదరేణువు నే నటంచు. 74

తే. భక్తులకుఁ దొండరంఘ్రిశబ్దమున కడియు
రేణునకుఁ బొడి యనియు నీరీతి ద్రవిడ
భాషఁ బరగుటఁ జేసి తద్భావ జనము
లతనిఁ దొండరడిప్పొడి యండ్రు భువిని. 75

సీ. సాత్త్వికత్వము పురుషత వహించినరీతి,
వినయంబు మూర్తిభవించినట్లు
కరుణ మనుష్యవిగ్రహము దాల్చినపోల్కి,
జ్ఞానంబు సాకార మైనపగిది
సత్యంబు పురుషవేషము ధరించినలీల,
శాంతి శరీరవంత మగుభాతి
శాంతంబు మానవజన్మ మెత్తినజాడ,
హరిభక్తి తను వొందినట్టిసరణి

తే. సకలకల్యాణగుణరత్నజలధి యగుచు
వెలయు శ్రీవైష్ణవాచారవిమలబుద్ధి
భగవదష్టాక్షరీమంత్రపరమజపప
రాయణుం డైనవిప్రనారాయణుండు. 76

క. వనమాలికాంశమున సం
జనన మగుట వాసనలవశమున నతనికిఁ
వనమాలిక లంబుజలో
చనునకు నర్పించుబుద్ధి జనియించుటయున్. 77

సీ. భూతనిర్వాణైకచాతురి గల్గఁ గ,
 ల్పాది నెయ్యది విష్ణుఁ డజున కొసఁగె
నజుఁడు నెద్దాని నిజాత్మజుం డైనట్టి,
 మనువు ప్రార్థింప సమ్మతి నొసంగె
మనువు నిక్ష్వాకు వేఁడిన నేది యొసఁగెనొ,
 యర్చించె నాతఁ డెయ్యది యయోధ్య
నిక్ష్వాకుపిమ్మట నెద్ది దాఁ బూజించి,
 జానకీపతి విభీషణున కిచ్చె
తే. నతఁడు గొనిపోవఁ జంద్రచోళాధిపతికి
నిచ్చినవరమ్ముఁ దలఁచి వాఁ డేలుచోళ
దేశమందున నిల్చె నేదివ్యధామ
మట్టి శ్రీరంగధామంబునందు మిగుల. 78

తే. ఆదిభోగీంద్రభోగశయ్యాతలమున
నుభయదేవీసమేతుఁ డై యున్న దేవ
దేవుఁ గరుణాపయోధి రాజీవనాభుఁ
బ్రేమఁ బూజించు నవపుష్పదానకముల. 79

వ. ఇట్లు పూజించుచుండి. 80

తే. పరులతోఁటలవిరులను సగుల నెంత
పెంపుగా స్వామి కే సమర్పించుచున్న
దీనిచేఁ గూలిమాత్రంబె కాని పూర్ణ
ఫలము రా దని యొక్క యుపాయ మెంచి. 81

క. ఆమహిఁ శ్రీరంగేశ
స్వామికిఁ బడమటఁ గవేరజాతీరమునన్

భూమకుటం బై తనరెడు
శ్రీమకుటద్వీపమధ్యసీమమునందున్. 82

. దేవార్చనానిమిత్తము
దా వేఱొకతోఁట వేయఁ దలఁచి యతండా
తావు గృహస్థులచేతన్
వెవిలి సుక్షేత్రభూమి విలువకుఁ గొనియెన్. 83

. ఇట్లు గైకొని. 84

తే. అది మఱియు మెత్తఁగా దున్ని యచ్చుఁ గట్టి
విత్తనా ల్చల్లి యలరుఁదీవియలయట్లు
నాటి కారీషరజము సాంద్రముగఁ జల్లి
విసువ కేతాప నెత్తుఁ గావేరినీరు. 85

. జాదులు చామంతులు విర
వాదులు కురువేరు కుందవాసంతికలున్
గేదంగులు కరవీరము
లాదిగఁ బ్రోదిగను జేసె నారామమునన్. 86

తే చుట్టు పంచాది వెట్టించి కట్టె నందుఁ
జవుకముగ మూఁడుచేతులచవికె యొకటి
నేమమునఁ బెంచెఁ దత్పురోభూమిఁ బరమ
పావనం బైనయొకతులసీవనంబు. 87

. ఇవ్విధంబునఁ బుష్పవాటిఁ బాటించునతండు. 88

గా. స్వాధ్యాయంబుఁ బఠించు సాంగకముగా సంధ్యాదన్నానుష్ఠా
నముల్, విధ్యుక్తక్రియ నాచరించుఁ దఱితో వ్రేల్చు
న్వహ్నిపూతాత్ముఁడై, మధ్యేరంగశయానమూర్తికిడు సమ్య

గ్భ_క్తితో మాలికల్, మధ్యాహ్నంబునఁ గుక్షి భిక్షుఁ డ
నుపు న్మాధూకరప్రక్రియన్. 89

క. ఈరీతిని భైక్షము తను
ధారకముగ నతఁ డనారతము నేకత మ
య్యారామముఁ బోషించును
భూరిసముత్సుకత శిశువుఁ బోషించుగతిన్. 90

క. శ్రీధరసేవారతుఁ డగు
నాధరణీసురునితోట నలరించుట కై
సాధుగతి వచ్చెనో యన
మాధవుఁ డేతెంచె వనరమాధవుఁ డంతన్. 91

వసంతఋతు వర్ణనము.

సీ. మదనప్రతాపాగ్నిమంటలు వోలె లే,
మావులఁ జిగురుజొంపములు వొలిచె
నసమాయుధునికీర్తి యొసఁగుకై వడి మల్లి,
కాకుంజములను మొగ్గలు దనర్చె
స్మరగజకర్ణచామరము లై పున్నాగ,
ములఁ బ్రసూనగుళుచ్ఛములు ఘటిల్లె
జలజాస్త్రబలరేణువులు నాఁగ సంపెంగ,
గమి మరుద్గతపరాగములు నెరసెఁ
తే. గుసుమబాణాసనముహురాఘుష్యమాణ
కాహళీశంఖపటహాఢక్కల తెఱంగుఁ
దాల్చె నామని యన మహాధ్వని నుదార
కీరకలకంఠసమదభృంగీకులంబు. 92

సీ. అంగజాఘూతాంతరంగజాయాకాంత,
ఘోరవాయువ్యకింశారుతములు
జరదురంగమపరిస్ఫురదుపహ్వారగిరి,
స్వైరసంచారనిర్ఝరుతములు
స్మరసమీకస్విన్నసరసకాంతోత్పన్న,
భూరిఘర్మాంభశ్శారుతములు
పథికమర్దనమహారథికమన్మథసహా,
యోరువీరవిహారచారుతములు

తే. హరిగతి సంచరించెఁ గావేరికాప్ర
తీరసారసకమలకల్హారకుముద
సారసౌరభ్యసంభారభారవహన
మారపరిచారమధుమాసమారుతములు. 93

వ. అప్పుడు వన్యాభిరామంబులు, వర్ధితయామంబులు, వాచాల
శుకపికస్తోమంబులు, వలమానభృంగంబులు, వాహ్యాళీ
విహారదనంగంబులు, వర్ధిష్ణుమలయపవమానంబులు, వర్జిత
జాతిప్రసూనంబులు, వాసితశీతలాంభంబులు, వల్గత్పరాగ
ధూసరంబులు నైనయవ్వాసరంబులయందు. 94

క. దివమును రేలును నధికో
త్సవమున నావైష్ణవావతంసము వికస
న్నవమాలికాదిసుమముల
నవమాలిక లిందిరాధినాథున కొసఁగున్. 95

తే. పాటలాది సుగంధపుష్పప్రకరము
లామని సృజించె శ్రీరంగధామమునను

హేమపుష్పంబు లలరింతు నే నటంచు
వచ్చెనో యన వేసవి వచ్చె నంత. 96

### గ్రీష్మర్తు వర్ణనము.

సీ. చండభానుఁడు కర్కసముఁ జేసి మున్న దా,
మహి కిచ్చునప్పులు మరలఁ గొనియె
వారిపూర్ణము లైనవసుధారకలశముల్,
శివలింగమూర్తులశిరము లెక్క
నృపమందిరములఁ బానీయకుంభంబులు,
వెస నుట్టిఁ గట్టుక వ్రేలఁ దొణఁగె
భువి నెల్లజనులదప్పులు మాన్పుతక్రంబుఁ,
దా దప్పిగొని నీళ్ళు ద్రావఁ జొచ్చె
తే. హరుఁడు కైలాసకుధరనాథాగ్రవసతి
విడిచి వటమూలతలమున విశ్రమించె
సతతనిజదీర్ఘతాతనూకృతినిశాప్ర
హారము లగునట్టి గ్రీష్మవాసరములందు. 97
మ. నవధూళిప్రవితానధూసరితనానాదిక్కమై భానువై
భవధూతాతతవారిపూర మగునబ్బల్ వేసవి న్వాపవీ
యవధూసౌధశిఖావళావళులు నాట్యంబాడఁ జేయుఙ్ దివిఙ్
దవధూమధ్వజదహ్యమానగహనోద్యద్ధ్భుమధూముచ్ఛటల్.
ఉ. వేసఁగిపెట్టఁ గ్రాఁగి పృథివీతల మంతయు వేఁడిమంగలం
బై సెక లీనఁ బ్రాణినివహంబులు లాజలువోలెఁ బ్రేలఁగా
నాసమయంబునఙ్ శరణమైయొకకొందఱఁ బ్రోచె ధాత్రిపై
నాసవపానకించిదవళాబ్జముఖీకుచకుంభశైత్యముల్. 99
వ. తత్కాలంబున. 100

క. శ్రీరంగవిభుని సేవకు
సారాంగన లవనిఁ బణ్యాసతు లైరో నా
మారాంగబలము లై తగు
వారాంగన లుండ్రు రంగవసతి నసంఖ్యల్. 101

## దేవదేవి యను వేశ్యచరిత్రము.

సీ. వలరాజుశృంగారవనములోఁ గ్రొమ్మావి,
కందర్పమాయాలమందుఁ గ్రోవి
చిత్తజన్ముఁడు విటశ్రేణి కిచ్చినయీవి,
మకరాంకసామ్రాజ్యసంపదలదీవి
కమలాతనూజరాగరసంపునడబావి,
జలజాస్త్రుటెక్కెంపుసన్నకావి
పుష్పకేతనువలపుల యేటినడుదీవి,
శంబరారాతియాజ్ఞాపురీవి
తే. దానిసౌందర్యమున కీవిధాతృసృష్టి
సరిసముం బిడుజో డెన్న సతులు గలరె
పచ్చవిల్కానితో నల్గి వచ్చి రంగ
భూవసతి నున్నరతిదేవి దేవదేవి 102

తే. అనుచు హిమశైలసేతుమధ్యమునఁ గల్గు
ధాత్రిజను లెల్ల వినుతింపఁ బాత్ర మయ్యె
విటమృగాఖేటపర్యటద్విషమబాణ
ముక్తమాయామురంగి యమ్మోహనాంగి. 103

తే. ఆతరుణిచక్కఁ బహునృత్యగీతవాద్య
కళలపెన్నికక్క నలరాజుకంచుఢక్క

ధర నహీ ప్రతి దానిసౌందర్యమునకు
మహితశృంగారరసవేణి మధురవాణి. 104

తే. అర్థి నయ్యక్కయును జెలియలును నృత్త
గీతవాద్యనిరూఢిఁ బ్రఖ్యాత మైన
మేళ మొనరించుకొని ప్రౌఢి మెరసి చోళ
విభునిఁ జోళాధిపతిఁ గాంచువేడ్క నరిగి. 105

తే. కాంచి రయ్యింతు లంబోధికాంచిరమణి
కొప్పుమాణిక్య మనుపోల్కి నొప్పుదాని
దంభదైతేయకుంభిమర్దనకపర్ద
మండలీఖండవిధుసుధామధుర మధుర. 106

సీ. వేదశాస్త్రపురాణవిహితనానాకళా,
శ్రేణిపారాయణక్షోణిసురము
ప్రధనదుర్జయరిపూన్మథనవిశ్రుతశౌర్య,
నానాన్యమాన్యరాజన్యవరము
వాణిజ్యకృషిపశుత్రాణనిర్మలధర్మ,
జీవికాధనికోరుభూవిసరము
జన్మప్రభృత్యగ్రజన్మశుశ్రూషాతి,
విప్రసుజ్ఞానశూద్రప్రకరము
తే. నిరతసేవాగతాష్టదిగ్ధరణిపాల
తతినివాసార్థభర్మనిర్మితనవీన
జీనమణిసౌధయూథశోభావిరాజ
మాన శాఖానగర మమ్మహానగరము 107

తే. అట్టి మధురానగరముఁ దొయ్యలులు చేరి
వేసఁ బ్రవేశం బొనర్చి యవ్వేశవాటి

గోత్రపాలిక విడిది గైకొని వసించి
రంత నరుణాంశుఁడును బశ్చిమాద్రిఁ దరిసె. 108

ఉ. రాగము నిండె నంతఁ దిమిరంబును బర్వె ననంతరంబ తా
రాగణ ముల్లసిల్లె నట రా జొదవెం దరువాతఁ జంద్రికా
భోగము సాఁగెఁ బిమ్మట బుభుక్షులు దీరెఁ జకోరపం క్తికిన్
జాగరణంబొనర్చెఁ బటుసాంద్రమధూళికలై కుముద్వతుల్.

క. ఈవిధమున నయ్యామవ
తీవైభవ మొప్పు మిగుల దృష్టించుచు ని
ద్రావశత శయ్యకుం జను
కై వడి రేరాజు గ్రుంకుగట్టున కరిగెన్. 110

ఉ. ఆయెడఁ దూర్పు తెల్లనగునంతనె శుక్రుఁడు దోఁచెఁ దార
కల్, చాయలఁ జిల్లగింజ లయి జాఱె పదాయుధకోటి 'క్కొ
క్కుర్రో, క్కో' యని మ్రోసె నద్దమునకు న్బ్రతియై శశి తా
ఱె సంజకెం, పాయి తమయొయ్యఁ బ్రాచినుదయాచలమెక్కెఁ
బయోజబంధుఁడున్. 111

వ. అంతకు మున్నె మేల్కాంచి సమయోచితకృత్యంబులుదీర్చి.

సీ. ముఖముజ్జన మొనర్చి నఖరేఖ రేఖగాఁ,
గమ్మకస్తూరినామమ్ముఁ దీర్చి
నునుపుగాఁ దట్టు పున్గున దువ్వి పువ్వదం,
డలతోడఁ గోరకొప్పులు ఘటించి
సొమ్ములసొమ్ములౌ నెమ్మేనులకు వింత,
యందంబుగాఁ దావిగంద మలఁది
పావడరంగు పైపై వన్నియలు గుల్కు,
వలిపెంపుమడుఁగుఁజలువలు ధరించి

తే. కప్పురపుఁదావి చిలుకుబాగా లొసంగ
నడపకత్తెలు తెలవాకుమడుపు లొసఁగ
నందియలు మ్రోయ నాస్థానికరుగుదెంచి
రింతు లలకంతుపట్టంపుదంతు లనఁగ. 113

క. భూరమణుఁడు కొలు విచ్చి హ
జారమ్మున నుండుకట్టిసమయ మెఱిఁగి యొ
య్యారంబున నభినవశృం
గారంబులు మెఱయఁ జని ప్రగల్భత మీఱన్. 114

—— దేవదేవి మధురవాణీసహిత యయి రాజసభ కేగుట. ——

మ. విధుబింబాస్యలు గాంచి కున్నతచలద్వేణీసముద్యద్విలా
సధురాంచల్లవణేక్షుసారమదిరాసర్పిర్దధిక్షీరనీ
రధునీశానచిరత్నరత్నరశనారాజత్కటీస్ఫారవి
శ్వధరారక్షణదక్షదక్షిణభుజవ్యాళేంద్రుఁ జోళేంద్రునిన్. 115

వ. కని వసంతసమయపికస్వరమాధురీరమాధురీణ నిరాఘాట
చాటు వాగ్వైఖరీసుధాసారంబు తత్సభాగారంబున దై
వారిఁ గైవారంబుఁ గావించి తదీయనిర్దేశంబున నుచిత
ప్రదేశంబున నాసీనలై. 116

చ. సవరనివీణెఁ గైకొని భుజంబున నొండొకకాయయున్నిజాం
కవసతినొక్కకాయయుఁ దగంబొసఁగించిన రెంటిసందునం
గువలయపత్త్రనేత్ర కుచకుంభము పొల్చు ధృతోత్తరీయమై
గవిసెనతోడికాయగమకంబునఁ దత్సదృశోజ్జ్వలాకృతిన్.

సీ. శ్రవణసంకుమదంబు సంధించి మునివ్రేల,
మృదురీతిఁ బైతీఁగె మెఱుఁగు సేయు

శ్రుతులు విజ్జోడై నచోఁ దంత్రి బిగువుగాఁ,
బీడించు గిటగిట బిరుడఁ ద్రిప్పఁ
గోట నూనంబుగాఁ బాటలోపలఁ గేలఁ,
జిటిపెటి తాలంబుఘటన నడుపుఁ
గరఁగించు నప్పటప్పటికిని గద్దైపై,
గెంటనంబైన క్రేఁగంటిచూపు
తే. పొసఁగి నిజహస్తములను నిం పొలయఁ జిత్ర
భంగి వినుపించు గీత ప్రబంధతతులు
చేతనాచేతనములు సంప్రీతిఁ గరఁగఁ
జంచలేక్షణ వీణె వాయించునపుడు. 118

క. ఏణాయతలోచన స
ప్రాణాయతచిత్రగాత్రపాంచాలిక యై
వాణియ యారూపో యన
వీణియ వాయించె నొగిఁ బ్రవీణత మెఱయన్. 119

వ. అంత నమ్మహీకాంతుం డెంతయు సంతసిల్లి యయ్యింతుల కుడుగర లొసంగి విడుగల కనిపిన దేవదేవిం జూపి మధుర వాణి మహీజాని కిట్లనియె. 120

ఉ. బాలిక రంగశాయిగుడిపాత్ర నృపాలవరేణ్య నీవు మా పాలికి రంగశాయివి కృపామతి నానతి యిమ్ము మావునం గేలికి నాటకన్న నృపకేసరి యట్ల యొసంగ భూమిభృ న్మాలికిఁ గేలుమోడ్చి చని మాపటికొల్వున నావిలాసినుల్.

వ. నర్తనసన్నాహంబునకు ననుకూలం బైనమేళంబుతోఁ జను దెంచి నృపాలునిం గాంచి నిజోచితస్థానంబున నిలిచిన.

చ. అరుదుగ వాద్యవిద్య బిరుదందినవాయిదకాఁరు లత్తఱిఁ
గరములు రెండు నొక్కసరిగా మురజంబులు మొట్టి దిమ్మున
న్మోరయఁగఁ జేసి కాంస్యరవముల్సెలఁగ న్నియతావధానులై
సరివినిపించి రుక్తగతి జంపెధ్రువాద్యట ముఖ్యతాళముల్.

వ. అంత. 124

క. రంజితపదమంజీరక
శింజితము సెలంగ రంగసీమ నిలిచి పు
ష్పాంజలియు వసుమతీపతి
కంజలియు నొనర్చి సభ్యు లభినుతి సేయన్. 125

క. లోలసమీరకిశోరక
లాలసవిహృతిక్రియాచలాచలదీప
జ్వాలికపోలిక నిలిచెఁ
బాలిక నృత్యాదిఁ దత్సభాగారమునన్. 126

వ. ఇట్లు నిలిచి. 127

మహాస్రగ్ధర. రవణింపన్ మున్మురం బై రవణిమలహరుల్గాఢ
తాడంబరస్ఫూర్తి విజృంభింపంగ రంగోర్విని బిరుదుపచా
రించి యచ్చాటుకారుల్, హావృదప్పాత్రరాయా యహా
హా బళిబళీ యంచుఁ బెల్లైచ్చరింపన్, రవలి న్నర్తించెఁ
గాంస్యారవ మురజముఖారావభావానువృత్తిన్. 128

సీ. నాగస్వరంబు గానము భుజంగియుఁ బోలె,
గీతమంగళము నంగీకరించి
హస్తవిన్యాసప్రశస్తవిభ్రమముల,
నయ మొప్ప నర్థాభినయముఁ జూపి

వివిధపేక్షణవిలాసవిచిత్రనటనలఁ,
భాటించి భావంబు తేటపఱిచి
చరణనూపురఝుణంఝుణనినాదంబులఁ,
దాళమానము దీపితంబు చేసి
తే. లాస్య మొనరించె నక్కమలాస్య యుపుడు
కోపుకోపున దొర యెల్ల దోఁపు లోనఁగ
నాయకుఁడు బాపురే! బాపురే! యటంచుఁ
గట్నములు పైఁడికోర బాగాలు నంప. 129

వ. అంత. 130

సీ. సవ్యహస్తం బర్ధచంద్రాభినయముతోఁ,
గా నంటి కటితటిఁ గదియఁ జేర్చి
కొనగోళ్ల నుదుటఁ గ్రమ్మిన పెంజెమట మాటి,
మాటికిఁ దిగిచి పో మీటికొనుచుఁ
జనుకట్టు విప్పఁ జుట్టును ఘనస్తనకాంతి,
చల్లించి యురముపై వెల్లి విరియఁ
గోపఘూర్ణిత మైనకోదమనాగము వోలె,
నలఁత నిట్టూర్పు నందంద నిగుడ
తే. నలస వళితంబు లైనకటాక్షవీక్ష
ణాంచలంబులు యువధైర్యకంచుకములు
చించి చీకాకుపఱచి విసంచుఁ జేసె
రామ నర్తనకేళీవిరామవేళ. 131

మ. అపు డాచోళవసుంధరాధిపతి నానానర్ఘ్యభూషాంబరా
దిపదార్థప్రకరంబు త్యాగమహిగా దీనారము ల్వేయునూ

టపదాఘ్రంగ్రుపచేసి పంపినఁ బ్రహృష్టస్వాంతలై కాంతలా
నృపతిం గేలుమొగిడ్చి వీడుకొని నిర్నిద్రప్రయాణంబునన్.

తే. నిజపురముఁ జేరవచ్చి తన్నికటభూమి
విపులతర మైనయొకవటవిటపినీడ
నెండవడి కాంత మగుదాఁక నుండి రచట
నచటఁ దమలోన ముచ్చట లాడుకొనుచు. 133

చ. తరణికులీన! లీనవసుధాసురనందన జీవమారుతో
ద్ధరణ ధురీణ! రీణసురధామపునఃపరిపూరణోదితా
పరిమితపుణ్య! పుణ్యజనభంజన! భంజనబద్ధకంకణ
స్ఫురితభుజాగ్ర! జాగ్రదవబోధసుఖామృతసింధుబాంధవా!

క. దివిజకిరీటితపదప
ల్లవసేవానిరత భరత లక్ష్మణ శత్రు
ఘ్న విభీషణ రవినందన
పవనజ యువరాణ్ముఖాప్తపరివారజనా. 135

మా. దశరథకులదీపా తథ్యపథ్యానులాపా
విశదగుణకలాపా వేదవేద్యస్వరూపా
యశరణగణగోపా హావ్యవాహప్రతాపా
సశరశరధిచాపా సాగరోత్పన్నకోపా. 136

గద్యము. ఇది శ్రీమదాపస్తంబసూత్ర భారద్వాజగోత్రపవిత్ర
శ్రీరామచంద్రకరుణాతరంగితవైభవ సారంగు నృసింహ
మంత్రితనూభవ పరిచిత భగవద్భాగవత కైంకర్యవిధాన
తమ్మయాభిధానప్రణీతం బైన వైజయంతీవిలాసం బను
మహాప్రబంధంబునందుఁ బ్రథమాశ్వాసము.

# వైజయంతీవిలాసము

## ద్వితీయాశ్వాసము.

---

క. శ్రీమదయోధ్యాపురవి
భీమానుషవిగ్రహా ప్రతీతాశ్రితలో
కామితఫలదాయక సౌ
త్రామణధరణీరుహేంద్ర రఘుకులచంద్రా. 1

వ. అవధరింపు మంతఁ బ్రొద్దు చల్ల నగుటయు మేళంబు నా
గంబసిచి యారామ లాగామలక్ష్మీప్రియాళు లగుప్రియా
ళులు నవంధ్యసౌగంధ్యవాసితసమీరణంబు లగుసమీర
ణంబులు ననవరతమధువ్రతేన రకీన ర్తనఖేలసారంగంబు
లగు నారంగంబులును నవనీతలసురసాలంబు లగు రసా
లంబులును నతిపృథులఫలాపహసితవనితాలికుచంబు లగు
లికుచంబులును నమృతమయూఖశేఖరస్వీకృతమాలంబు
లగుతమాలంబులును నార్యాశిరోధార్యమాణనవమాలిక
లగు నవమాలికలును నంగనాజనకర్ణపూరంబు లగు కర్ణ
పూరంబులును నాత్మీయకుసుమమాలికావికాసోపమాన
మేరువు లగునమేరువులును నభినవప్రసూనదామవ్యామో
హితయువకులంబు లగువకులంబులును నాది యైనమేదినీరు
హంబుల భానుమంతునికిరణంబులకుఁ బ్రవేశంబు లేక త్రై
లోక్యజైత్రయాత్రాసమారంభ విజృంభమాణసేనాడంబర

శంబరారిసుహృద్వ్యానం బగు నుద్యానంబు నవలోకించుచుఁ జని చని. 2

సీ. అనిమిషాధీశునందనవనంబునుఁ బోలె,
మందారకల్పద్రుమహిత మగుచు
బాణవైరికుమారుతూణీరమునుఁ బోలె,
నవపుష్పకాండసనాథ మగుచు
వనజనాభునిసుదర్శనచక్రమునుఁ బోలె,
దివ్యబృందావనోద్దీప్త మగుచు
గగనగంగాతరంగప్రవాహము వోలె,
నవిరళామృతఫలోదార మగుచుఁ
తే. బ్రౌఢదివ్యవధూముఖాబ్జమునుఁ బోలెఁ
జారుతరకీరమధువాక్ప్రచార మగుచు
నలరు నవ్విప్రనారాయణాఖ్యపుష్ప
వాటి సంకల్పభవపటవాసపేటి. 3

వ. కాంచి యందుఁ బ్రవేశించి తన్మధ్యప్రదేశంబున. 4

దేవదేవీమధురవాణులు విప్రనారాయణుఁ జూచుట.

సీ. ప్రతిమాసవపనముండితమైన మస్తంబు,
పెడతలఁ దూలాడుపిల్లసిగయుఁ
దులసినేత్తమ్మిపూసలగొప్పపేరులు,
విపులరంధ్రము లైనవ్రేలుఁ జెవులు
నడువీథి గలనిల్వునామంబుపట్టెలు,
శోభితం బగుతిరుచూర్ణరేఖ
పెన్మ్రాలిత్రాటఁ గీల్కొన్న కౌపీనంబు.
వితతంపునీర్కావివేష్టువలును

తే. గలిగి పద్మాసనస్థుఁ డై కన్ను మోడ్చి
భగవదారాధనైకతత్పరత నున్న
శ్రీమదష్టాక్షరీమంత్రచింతనాప
రాయణుం డైన విప్రనారాయణుండు. 5

వ. ఇట్లున్న. 6

క. కాంచి యనుష్ఠానము మాఁగి
యుంచి యరుగునట్టివేళ నెదుట నిలిచి యా
చంచలలోచన లతనికిఁ
గించిద్వారమునఁ జే మొగిచి మ్రొక్కుటయున్. 7

క. చందురుఁ గనునరవిందము
చందంబున మోము వంచి సంయమికులసం
క్రందనుఁ డారామద్రుమ
బృందమునడుచక్కి నపుడు వేడుం జనుడున్, 8

వ. అప్పు డద్దేవదేవి యగ్రజ కిట్లనియె. 9

ఉ. మ్రొక్కిన నెవ్వరే చునఁడు మోమటు పెట్టుక చక్కఁబోయెనీ
దిక్కును జూడఁడాయె నొకదీవనమాటయు నాడఁడాయెపెఁ
డెక్కడివైష్ణవుండు మన కేటికి మ్రొక్కితిమమ్మ యక్కటా
సెక్కెసి వెఱ్ఱిబుద్ధిమెయి నిద్దుర వోయిన వానికాళ్లకున్. 10

వ. అని యిట్లు నిరాకరించి పలుకు నద్దేవదేవిం గనుంగొని
మధురవాణి యిట్లనియె. 11

ఉ. చూచిన నేమి నీవలను చూడక యుండిన నేమి పూజ్యులం
జూచినభక్తి మ్రొక్కుట యొశోభన మీశుఁడు బ్రాహ్మణుండు ధా
త్రీచరులందు బ్రాహ్మణుఁడు దేవుఁడు దేవుఁడు నీవు మ్రొక్కినన్
జూచునొ పల్కునో యటుల సుస్మితుఁడు న్సరసీరుహాననా.

ఆ. బ్రహ్మచర్యమును జపంబు నధ్యయనంబు
హరిదినోపవాస మచ్యుతాంఘ్రి
చింతనముఁ దదీయసేవానురక్తియు
సుదతి జగతి నితనిసొమ్ము సుమ్ము. 13

మ. లలనా యీతఁడశోకవృక్షముఁ రసాలంబుల్ బ్రియాళంబు వా
విలియుం బొన్నయుఁ బొట్టుగున్బొగడ క్రొవ్విల్గోఁగు సంపెంగ
నిం, దులఁ బోషింపఁడు దోహదంబునకు నింతుల్వ్రత్తురన్నంకని
ర్తల మింతింతనవచ్చునే యితనివైరాగ్యంబు భావింపఁగన్.

వ. అనిన మందస్మితసుందరవదనారవిందయై యయ్యిందు
వదన యగ్రజ కిట్లనియె. 15

చ. ప్రకటజితేంద్రియుల్ ధరఁ బరాశరకౌశికులంతవారు స్త్రీ
లకు వశు లంతకంటె మిగులం దృఢమె మగకచ్చ బిగ్గఁగ
ట్టుకొనఁగనీఁత డెంతశుకుఁడో హనుమంతుఁడో భీష్ముఁడో వినా
యకుఁడో తలంచుమా సరసిజాయతలోచన నెమ్మనంబునన్.

క. ఈనిష్ఠ లింతి తారస
మైనంతదనుక నె సూ సదాచారి యటం
చే నబ్బినదాఁక యు నను
మానిజనవిడంబనములు మన మెఱుఁగనివే. 17

క. ఇటువంటయ్యలె కారా
చిటుకు మనక యుండ సందెచీఁకటివేళ
ఘుటచేటీవిటులై యి
క్కటకంబునఁ దిరుగువారు కంజదళాక్షీ! 18

ఆ. కదసి చూడ ఘోటకబ్రహ్మచర్యంబు
పింగళాజపంబు పిల్లిశీల

మజగరోపవాస మలబకధ్యానంబు
నక్కవినయ మిట్టినయము లెల్ల. 19

సీ. ముగ్ధేందువదనలముఖవిలాసములకుఁ,
జిగురుఁబోఁడులకుచాశ్లేషములకు
మహిళాజనంబులమధురభాషలకును,
వనితలనిశ్వాసవాసనలకుఁ
గలకంఠకంఠులకలికిమూవులకును,
బాటలగంధులపాటలకును
మత్తేభయానలమందహాసములకు,
మగువలవాతెఱమధువులకును
తే. నంగనలపాదహస్తవిన్యాసములకు
వెంటఁ బరువెత్తు మునివనవృత్తితతులు
విషయసౌఖ్యస్వరూపవివేకి యైన
నరుఁడు నశుఁ డౌట యేమి యచ్చెరువు జగతి. 20

క. కిలికించితరసపూరముఁ
జిలికించి కటాక్షవీక్ష చే నలినాక్షుల్
తిలకించి చూచినప్పుడు
పులకించక నరులదేహములు లోహములే 21

శా. శ్రీరంగేశునకు న్సదా యితఁడు పూచేరుల్ సమర్పించు టా
హారార్థం బగుఁగాని పూని సహజం బౌ దేవతాభక్తిఁ గా
దారామంబునఁ గూలి కెవ్వరిటు సేయం బంచిరో యూయప
స్మారభ్రాంతి మహాత్ముశీల మనుచుర్ సన్న్యాగ్వచో వైఖరిన్.
వ. అనినఁ జెలియలికి నప్ప యి ట్లనియె. 23

శా. నీరేజాయతనేత్ర నిందితముగా నీ వాడిన న్నీదుజి
హ్వారంగంబున నున్న శారద యసత్యం బాడఁగా నేర్చునే
స్మారభ్రాంతిమదంబు లేదితని కెంచన్ ధాత్రిఁ గాఁగా నప
స్మారభ్రాంతిమదాత్ముఁ డంచుఁ బలికె న్సఖ్యగ్వచోవైఖరిన్.

వ. నావుడు నద్దేవదేవి కనుంగొని. 25

ఆ. నిర్జితేంద్రియుండు నిష్ఠాపరుం డంచు
నప్ప! సారెసారెఁ జెప్పె దీవు
పనిఁ బ్రతిన చెఱిచి విటుఁ జేసి తెచ్చిన
గలదె పందె మనినఁ గొంత పలికె. 26

క. నీవే కాదిప్పురిలో
నేవేశ్యాపుత్త్రి యైన నీతని విటుగాం
గావింపఁ జాలె నేనియు
నావేశ్యకు నీళ్లుఁ గట్టియలు నే మోతున్. 27

వ. అనిన దేవదేవి యిట్లనియె. 28

తే. అప్పరో! నీకు నేఁ గట్టియలును నీళ్లు
నెంత మోచినఁ గాని నాకెగ్గు లేదు
నిన్నుఁ బనిగొనఁగా నాకు నీతి కాదు
వేఱ పన్నిద మొకటి గావింపు మనిన. 29

క. నీ వీవైష్ణవు విటునిం
గావించిన లంజెతనపుగడన విడిచెదన్
గావింప లేక యుండిన
నీవు న్విడిచెదవె యనిన నెలఁతుక యొప్పెన్. 30

క. తరుణీమణు లిరువురు నీ
కరణిం బన్నిదము నుడివి క్రమ్మఱ లీలా

సరణిం బురికిం జేరిరి
తత్తణియుఁ బశ్చిమపయోధిదరికి న్జేరెన్. 31

—సూర్యాస్తమయ వర్ణనము.—

క. పెరిఁగినచీఁకటి తనుఁ గని
సురిగి యురిగి వరుణునగరుఁ జొచ్చినదానిక
బోరిఁ గొన వెంబడిఁ దానును
సరిగినక్రియ నినుఁడు గ్రుంకె నపరాంబుధిలోన్. 32

తే ధాత్రి దినరాజు విడిచి పాతాళమునకుఁ
జనుచు వేలంబు వెలుఁగఁ జేసినవెలుంగు
చాయ నెఱసంజ యొప్పెఁ దదీయధూమ
పటలమును బోలెఁ జిమ్మచీఁకటులు మించె. 33

తే. అంబరారణ్యమునఁ బ్రవృద్ధంబు లైన
ఘోరతిమిరతమాలభూమీరుహముల
దట్టముగ నల్లుకొని పూచినట్టిమొల్ల
విరులు నాఁ బొల్చెఁ దారలయ్యిరులయందు. 34

ఆ. వెట్టిచెఱకుఁగోలవింటిబద్దకు మల్లె
తీవె నారిఁ జేసి భావభవుఁడు
పఱచు పువ్వుఁబోండ్ల పెఱచోటులక మొత్త
విరులతూఁపు లేసి మరులు గొలిపె. 35

వ. ఆసమయంబున. 36

చ పరువడి జారకామినులపల్కులు జారులకుం దదీయవా
క్సరణులు జారకాంతలకు సమ్మతిగా వినుపింపుచుం బోరిం
బోరి నుభయానురాగరసపోషణులై వెస నిందునందునక
దిరుగుదు రాస్యక్రోవులగతిం బురవీథుల శంభళీసతుల్. 37

ఉ. కుట్టనికాని వేశములు గోష్ఠతలంబులు తత్కరీషపుం
దిబ్బలు పాడుగోడలు నదీసదనంబులు నిష్కుటంబులున్
గట్టికుటీరము ల్పసులగాడిమఱుంగులు గుళ్ళపంచలు
న్గట్టనియిండ్లు జారరతికార్యసమాచరణైకసిద్ధికిన్. 38

వ. తత్పురీదేశములందు. 39

మ. అసుగంధాంగవిలేపనం బనఖదంతాంకం బతాంబూల మ
ప్రసవాలంకరణం బనుక్తమణితారావం బశయ్యాతలం
బసుఖస్వాపమబంధనైపుణ మసంప్రాప్తాంగసంక్షాళనం
బసిధారాటము నైనజారరతికృత్యం బత్తఱి న్వర్తిలెన్. 40

మ. తవులై యేలినవారినిత్యగృహకృత్యంబంతయుం దీర్చి తేఁ
కువతో నిండ్లకు వచ్చునప్పటికిఁ జెక్కుల్ రాకలున్ రెండు
మూఁడువిడేలాకులు పోఁకలూనివిడి వాటున్గోడలై తత్కుటీ
భవనప్రాంగణసీమఁ ద్రిమ్మరుదు రంభకుంభ చేటీవిటుల్.

క. ఆతఱిఁ బ్రహ్లాదసమ
న్వితం బై కువలయంబు విలసిల్లె నవ
ద్యోతసటాపటలుం డై
శీతాంశుఁడు పొడిచె నారసింహుఁడు పోలెన్. 42

తే. దితిజరక్తారుణనృసింహదివ్యమూర్తిఁ
బోలి యొప్పారెఁ బొడుపుఁ గెంపున విధుండు
తద్విశాలాంకతలదైత్యతనువుపోలె
లాంఛనం బొప్పె నమ్మండలంబునందు. • 43

చ. అనిమిషమండలీవిరచితాభ్రధునీసలిలాభిషేచనం
బున విమలాంగుఁడౌ నృహరిపోల్కి సుధాకిరణుం డనంతరం

బునఁ దెలుపొందెఁ దత్సలిలపూరము రోదసిఁ బిక్కటిల్లనో
యన బలితంపువెన్నెల లజాండవిభాగము నిండె నత్తఱిన్.

సీ. చెలువ గట్టినచీర మొలఁగొంతఁ గట్టియా,
సగము పైవల్లెవాటుగ నమర్చి
పనిఁ బూని రేక దిద్దినకన్బొమల నంటఁ,
గమ్మతావులకదంబమ్ము నలఁది
లీలగా నూఁకుదోర్మూలభాగమ్ములు,
వాసించుగోవజవ్వాదిఁ దుడిచి
తమరాక ప్రియుల కెంతయు దాల విసరాఁ బి,
సాళించుకిఱ్ఱుపాగాలు మెట్టి
తే. చుట్టుపువ్వులసిగలు కస్తూరిబొట్లు
సందితాయెతులును జెంపకందములును
కలిగి నవయస్కులగు కోడెకాండ్రఁ గూడి
విటులు విహరింతు రప్పోటి వేశ్యవాటి. 45

వ. మఱియును. 46

సీ. అలకము ల్మాటి యూదలఁ బాగఁ జుట్టి పై,
నడ్డకట్టురుమాలుగుడ్డఁ గట్టి
చెవుల కమ్మలసట్లఁ జవుకట్లు మేలినీ,
లాలపోఁగులజోళ్లు గీలుకొల్పి
యురచట్ట దొడిగి మై నడ్డంబు దిగటంబు,
వలిపెదుప్పటి వల్లెవాటు వేసి
నిటలభాగమునందు నిడుసోగ తీరుగా,
మల్లెపూమొగ్గనామంబు దీర్చి

తే. ద్రవిడపరిచారకులు వోలెఁ దరుణవేళ్ల
లడపములు పూనిరాఁ గొంద ఱవ్వేలంది
వెన్నెలల నారజపుఁబీఁకవన్నె లలరఁ
గంతుగురుపల్లకీసేవ గాంతు రందు. 47

ఉ. కొందఱు సహ్యజాజఠరకోమలసైకతవేదికావలిం
గొందఱు చంద్రకాంతమణికుట్టిమకేళిగృహాంగణంబులం
గొందఱు మందిరోపరికకుప్పరిపాలితవృక్షవాటికా
ళిందముల న్మనోజసుఖలీలలఁ దేలిరి వారలత్తఱిన్. 48

ఉ. తూరుపు తెల్లవాఱె శశితో యధిపాశకుఁ జేరె వెన్నెల
ల్తారలతో నడాఱెఁ గుముదంబులు నిద్రలఁ గూరె జక్కవల్
గేరెఁ బ్రసూనసాయకునికి న్బని దీఱె దిగంతరంబులం
దారెఁ జకోరసంఘములు దారతమీఱెను సాంధ్యరాగముల్. 49

వ. అంత. 50

సూర్యోదయ వర్ణనము.

మహాస్రగ్ధర. ఉదయక్షోణీధరాధ్యాధ్యుషితపిశితభుగ్గ్రోధయూ
థాగ్రహోన్య, త్కదనవ్యాదేవదత్తార్ఘ్యజలకులిశసంఘాత
పాతక్షతద్రా, క్షసవన్మందేహదేహక్షరదురుతరరక్తప్రభా
మండలీకుం, డుదయించెఁ భాస్కరుం డత్యుపరిదృఢసము
ద్యోతశోభాకరుం డై. 51

వ. అప్పుడు. 52

తే. విప్రనారాయణాఖ్యుని విటునిఁ జేసి
తెత్తు నని పంత మాడిన దేవదేవి
కనకమణిభూషణసుగంధగంధమాల్య
సుపటశృంగార మెడలించి కపటలీల. 53

-- దేవదేవి విప్రనారాయణుకడ కేగుట. --

సీ. నడిముక్కు మీఁద సన్నపునామంబు,
నడుమ మంజిడికావినిడుదరేక
యలఁతిపీనుల విచ్చుటాకులదుద్దులు,
సిగవేసి ముడిచిన చిన్నితులసిముఁ
జనుదోయి నిఱియఁ గట్టినచుట్టుపయ్యెద,
క్రొత్త దోమినదంతకోరకములు
త్రికముపై నెగఁగట్టు దిగఁగట్టు దువ్వల్వ,
నేలపైఁ జీరాడుఁ గ్రేలుఁగచ్చ
తే. కంఠపార్శ్వంబున నగంబు గానిపించు
తులసితామరపూసలవలుదసరులు
పూని నిక్కంపుదాసరిసానివోలె
విప్రనారాయణారామవీథిఁ జొచ్చె. 54
వ. తదీయమధ్యప్రదేశంబునందు. 55
క. అమ్మగువ గనుంగొని యో
ముమ్మరముగఁ బట్టినామములు మైనెల్లం
గ్రమ్మికొన మట్టిఁ బెట్టిన
గుమ్మడికాయయును బోలెఁ గూర్చున్నతనిన్. 56
తే. విప్రనారాయణుని మాల్యవిరచనావ్య
సనపరాయణుఁ జూచి యచ్చటనె పుడమి
నుదురు సోఁకఁగ మ్రొక్కి యయ్యెదుట మోడ్పుఁ
గేలితో నున్నవెడదాసురాలిఁ జూచి. 57
క. ఎయ్యది కుల మెయ్యది నెల
వెయ్యది నీనామధేయ మిచ్చోటికి రా

నెయ్యది ప్రస్తుత మనినం
దొయ్యలి యాబ్రహ్మచారితో నిట్లనియెన్. . 58

చ. అకలుష మైనతావకవనాశ్రమభూమికిఁ శంక లేక హీ
నకులులకెల్లఁ గాఁ దగు మాచంబున నుంచకుఁ డట్టిదేను శూ
ద్రకులమందాన నందును వితంతునుగా నొకరింట దాసిఁగా
నొకమగనాలిఁగాను దగులొండెద లేదు తనంతమానిసిన్.

సీ. ధర వర్ణముల కెల్ల గురువు బ్రాహ్మణుఁ డని,
యఖలశ్రుతులుఁ బల్కు నదియు కాదె
బ్రహ్మనిర్మిత మైనపరమధర్మము శూద్ర,
జాతికి బ్రాహ్మణాచరణసేవ
యట్టి బ్రాహ్మణులందు హరిభక్తులు త్రిలోక,
పావను లాహరిభక్తులందు
వైష్ణవు ల్ఘనులు శ్రీవైష్ణవజనులందు,
విజితేంద్రియుండు శ్రీవిష్ణుమూర్తి

తే. యిన్నిగుణములు గణుతింప నిపుడు స్వామి
వలనఁ గల వని మీఁతిరువడిఘశాస్త్ర
యింప వచ్చితి నను గటాక్షింపు స్వామి
నాథ యెవ్వరు లేనియనాథ ననిన. 60

ఆ. తల్లి దండ్రి యన్న దమ్ము లెవ్వరు లేక
యొంటి మింటినుండి యూట్టిపడితె
యింతి యింతకాల మెందుంటివి విరక్తి
కేని నిమిత్త మేమి యొనరఁ జెపుమ. 61

వ. నావుడు నయ్యతివ యిట్లనియె. 62

శా. స్వామీ! యేమని విన్నవింతు నతికష్టంబైన నాజన్మ మీ
భూమి న్నేఁ బడినట్టిపాట్లు శునకంబుల్ సూకరంబు ల్సహా
గా ముఁ బడ్డది లేదు మీ రనఁగ నాతోఁ ద్రంగనాథుండు దో
డ్తో మీముందఱఁ జెప్పినన్ దొలఁగుమద్దోషంబుని శ్శేషమై.

వ. ఆకర్ణింపుము. 64

సీ. వెలయు నేపీడు నిర్మలధర్మమహిమచే,
ధాత్రి సత్యవ్రతక్షేత్ర మనఁగఁ
బ్రవహించె నెందు వేదవతి పేరిఁట బ్రహ్మ,
దేవునింతి సరస్వతీ స్రవంతి
కావించె నెచట నిష్కామధీమహితుఁ డై,
హరిగుఱించి విరించి యధ్వరంబుఁ
జవి చూచె నెచ్చోట సవనాగ్ని హుతమహా,
హుతిహవిస్సార మబ్జోదరుండు

తే. కటకమాత్రంబె యది విశంకటజలగ్ర
హగ్రహణవిగ్రహాయ స్తహ స్తివరద
చిరదయావాలమోక్షలక్ష్మీవిశాల
కటితటీనూత్నకళ్యాణకాంచి కాంచి. 65

వ. అందు. 66

సీ. కలహంసి, కర్పూరకలిక, పద్మావతి,
మందారవల్లరి, మధురవాణి,
సౌందర్యలహరి, పుష్పసుగంధి, చిత్రాంగి,
కాంచనమాలిక, కనకలేఖ,
రాజమోహిని, కుమారసరస్వతి, సుశీల,
మదనాభిరామ, మన్మథకటారి,

మంజుభాషిణి, భానుమతి, రమాతిలకంబు,
కామమంజరి, చంద్రకళ, యనంగ

తే. భూమిసలిలాగ్ని పవనార్కసోమకామ
విధిసుధాకరమునితటిద్విబుధమర్త్య
జనిత లగునచ్చరలకును జనన మొంది
వారసతు లుంద్ర పారశృంగారవతులు.

తే. అందు నొకవారసతిపుత్త్రి నై జనించి
వృద్ధిఁ బొందితి దేవదేవి యనుపేర
నభ్యసించితి బాల్యంబునందు నృత్య
వాద్యసంగీతసాహిత్యవిద్య లెల్ల.

మ. ఎలమిన్ శైశవయావనాంతరవయో హేలావి
నలమన్ గన్గొనిజ్యోత్స్యలిచ్చినశుభోదంచన్మహ
జెలిమిన్ భూసురవృద్ధబాంధవజనాశీర్వాదపూ
దలిమం బెక్కఁగఁ జేసెఁ దల్లి నను నుద్యన్మో

క. క్రొన్ననవిల్తుఁడు నాకను
సన్నల వర్తిల్లు సురతసామ్రాజ్యగతిం
గన్నెఱికంబుల వలపుల
మన్నెఱికం బెఱిఁగి విటుల మహి నేఁ గొంద

ఉ. పంకజనాభు హస్తిగిరిభర్త భజింపఁగ వచ్చి
తెంకణకొంకణద్రవిడదేశనృపాలకులంటు కాం
కంకణముద్రికాళికయి కానుక లిచ్చి వసింతు
యంకణభూమిఁబల్లకులునందలముల్ పడిగాఁపు

ఉ. కిట్టున నొండొకళ్లు తమ కేతమ కే పిలు పంచు
గొట్టెలు పాడిపైరములు కోకలు రూకలుముంది

వట్టుగ నిచ్చి వచ్చి తలవాకిలిఁ గాతుగు రేతిరిం బగల్
గుట్టవయస్సుమల్లరవుఁగోడెలు సైరికరాట్కుమారకుల్.

తే. వైష్ణవోత్తమ ! మీవంటివారియెదుట
నాత్మసంస్తుతి నీతిగా దైన వినుము
నాటిదినములయందు మన్మందిరమున
సంతతంబును గనకవర్షంబు గురియు. 73

ఆ. అట్టికడన విడిచి యవని భిక్షావృత్తి
నేల తిరిగె దంటి వేని వినుము
నలువసృష్టిఁ గలుగుకులములలో నెల్లఁ
గాకులంబు లంజకాకులంబు. 74

సీ. అర్థప్రమోహణాయత్తంబు చిత్తంబు,
బహువృషాభాషణాభ్యసన రసన
యాజన్మపశ్యతోహారములు కరములు,
ప్రచురహేయాశనభక్షి కుక్షి
సంతతాన్యాయప్రచార మాచారంబు,
మతకంపుమాయలమనువు తనువు
సకలవర్ణోచ్ఛిష్టసదనంబు వదనంబు,
వితతకుతర్కాభివృద్ధి బుద్ధి
తే. అంగజవ్యాధిఁ గడు పుచ్చినట్టివిటుల
యాత్మజలపూరముల తెట్టు వల్లపట్టు
హేయభాజన మెన్నిఁట నెన్నిచూడ
వేశ్యజన్మంబు జన్మమే విప్రవర్య! 75

చ. ఎటు గణుతింప యోజనము లేఁబదికోటులు భూమి దీనిలో
నటు తుహినాచలేంద్రమున కవ్వలి వన్నియు దేవ భూ

క. ఆపల్కు లాలకించినఁ
దీ పొల్కుచుఁ గురియుఁ గమ్మదేనియసోనల్
లోపలఁ బరికించిన నీ
లోపలసదృశములు వారయోషాతతికిన్. 82

తే. అవల రో వట్టి యెంత రేయైన నిద్ర
గూఁతుఁ బోనీదు పోఁ కాకు గొలుకులాటకు
నాఁ డవశ్యంబుఁ బిలిపించు నవువిటులఁ
దల్లి యుల్లుంద్ర పెదబూచి ధనపిశాచి. 83

సీ. మునుపు జంగాలఁ జేసినభుజంగులఁ గన్న
గర్జించి శునకమై కఱువ వచ్చుఁ
బెట్టాకించుక తీసి కట్టెనఁ బట్టిచే,
దట్టించు విటునిఁ గందర్పు నైన
బాపదక్షిణ చేతఁ బడినఁ దజ్జామాత
బ్రణుతించు విటశిఖామణి యటంచు
ధనవంతుఁ డైనమొత్తనివాఁడు చేరెనా,
పుత్త్రిక కొప్పించుఁ బోటివిటులఁ
తే. బయిసిమాలించుఁ దనపిన్నవయసునాఁటి
పడవుసుద్దులు దలపెట్టి పాఁతజోలి
నోరు విడివడ్డఁ బచ్చిబూతే రచించు
వివిధమాయామయోపేత వేశ్యమాత. 84

శా. ఏ వేళన్ మతి యేముహూర్తమున మాయిల్ చొచ్చినాఁడో మ
నో,భావజ్ఞుండయి సర్వమున్నదువు నాబంగారుకాళ్ళయ్య జే
జే వెయ్యేఁడులు శ్లాఘ్య మేలు మనుచు న్ జేమోడ్చు నీరీతిమా
యావాదంబుల ఛేధనంబొలుచు వేశ్యామాతజామాతలన్.

ఉ. ఈ విట రమ్ము పొమ్మనుట యే గుణ మింతియ కాక మాకు నీ
యీవు లదేమి గుత్తు విశేషమే పదిలచ్చలు వద్ద టంటిమా
దేవరచిత్తవృత్తి యొకతీరయి యుండు నిదే మటంచు వి
ఖ్యావినయోక్తుల న్విటులయర్థములాల్తురు వారకామినుల్.

తే. అనఘ! వేశ్యావిడంబవర్తనము లెన్న
నిసుకపాతఱ యీజోలి యేల త్రవ్వ
నప్పుడపుఁగూటిపై నసహ్యత జనించి
నామనసు రోసినట్టిచందంబు వినుము. 87

క. ఆరోహిణి నవరోహిణి
నే రతి రవ డుల్లి విలువ హెచ్చులుగా బం
గారములును దారములు న
పారములుగ నే గడించుపర్యాయమునన్. 88

మ. ఒకయేకాదశినాఁటిరేయి సము లై యున్నట్టిరో వెట్టు వే
డుకకాం డ్రెవ్వరు రామిఁబల్లవుఁడొకండుగా లేకలోఁగ్రాఁగి శ
య్యకడ న్నిల్వ సహింప కిల్వెడలి యాతాయాతరీతి న్మనో
వికలత్వంబున వాడవాడల విటాన్వేషంబుఁగావించుచున్.

ఉ. ఆనిశివేళ విష్ణుభవనాంగణమంటపవేదిక న్సుఖా
సీనత నుండి జాగరము సేయుసుధీజను లర్థదీప్తిగా
భూనుతలీల భాగవతముం బఠియింపఁగ నందుఁ బింగళా
ఖ్యానము వింటి నంటినయఘావలి యెల్లను బోవపీనులన్.

క. అది విని వేశ్యాభవ మి
ట్టిదె కా యని విరతి పుట్టె డెందంబున బె
ట్టిద మగునర్థార్జనక
ష్టదురాశాపాశముం దటాలున నూడెన్. 91

క. ఆవేశ్య నాకు గురువుగ
నే వేశ్యాత్వంబు మాని యేకాకిని నై
శ్రీ వేంకట పురుషోత్తము
దేవాయతనాదిదివ్యదేశములందున్. 92

సీ. ప్రద్యుమ్నజనకధర్మస్థాపకత్వమే,
సతతంబు నిజకులాచారముగను
పద్మనాభద్వయోపరిదివ్యనామమే,
యనిశంబు జిహ్వ కభ్యాసముగను
జలరుహాంబకచిహ్నములె సంతతంబును,
బాహుమూలముల కాభరణములుగ
భగవద్విలాసవైభవమె యశ్రాంతంబు,
నంతరంగంబున కాస్థ గాఁగ

తే. నవిరళభుజంగశయనసేవానురక్తి
చిత్తమున హాటకాంబరచింతనంబె
కాని తక్కినవాని డగ్గఱఁగఁ బోక
భాగవతముద్ర నొంటి నిప్పాట నుంటి. 93

మ అకలంకస్థితి నాఁటనుండియును శూద్రాన్నంబువర్జించి మా
ధుకరప్రక్రియ బ్రాహ్మణాన్నమె భుజింతుఁ లేనిచో సజ్జన
ప్రకరాగారములందుఁ జేయుదుస్వయంపాకంబు శ్రీరంగశా
యికృప నిట్లే దినంబులీకరణిస్వామీ! నేఁటిపర్యంతమున్.

తే. వారసతులై నయీసీమవారివలెనె
మోడిమానిసినైన నేఁగోడు లేదు
జిహ్వ నాల్గచ్చరాలు నేర్చినకతాన
పడపుఁగూటికి ఘనసు గొల్పక యునైతి. 95

క. అని వనిత యివ్విధంబునఁ
దనకులశీలములఁ దెల్పు దానిని వేశ్యాం
గనఁగా నెఱిఁగి మనంబున
ననుమానము వొడమి వైష్ణవాగ్రణి యనియెన్. 96

క. ఇమ్ముల వేశ్యాసహవా
సమ్ములు శ్రీవైష్ణవులకుఁ జందం బగునే
మ మ్మావల నేమందురొ
కొమ్మా! యీలోకు లెంచుకొమ్మా దీనిన్. 97

ఉ. కాకులు రావిపండ్లు దిని క్రక్కు శిలామయదేవమందిరా
నీకములందు రావులు జనించును సజ్జనచిత్తవృత్తి య
వ్యాకులలీల నాతిగుడివంటిది లోకములోన వేశ్యలుం
గాకులవంటివార లటుగానఁ బ్రమాదము చేరనిచ్చినన్.

వ. అనిన నవ్వేదవేదికి దేవదేవి యిట్లనియె. 99

ఉ. ఎండకు కైనఁ గొంగు పఱచెండకు కైనను బాస దప్పిమై
నెండఱు రోఁతసేఁత లపు డేగతిఁ జేసిన సెచ్చగించుచుం
డెందము దాయఁగాఁ గొని గడించినకష్టపులంజకూడు నా
కిందక రోసి వచ్చితి సహించు నె కక్కినకూడు గ్రమ్మఱన్.

క. భోగేచ్ఛ నాకుఁ గల్గిన
నీగతిఁ జరియింప నేటికింటనె యున్న
న్నాగదె మున్నిటివిటసం
భోగము గంతలకుఁ దగిన బొంతలు లేవే. 101

క. నామనసు రోసి విఱిగిన
దీమెయి నీమనసు రోయకే విఱిగినఁ ధ్రిం

దేమిటికి శంక పడ ధా
త్రీమండలిఁ బాలు విఱిగితే పెరుఁ గగునే. 102

క. వినవే సామెత మును తన
మనసు పదిల మైన లంజెమందిరమున నై
నను గాఁపుర ముండఁగ నగు
ననఁగను ని ట్లాడ నీకు నగునె మహాత్మా. 103

వ. అని యిట్లొప్పుపడం జెప్పిన నప్పలుకులు విని యతండు తన
మనంబున. 104

తే. రూపమునఁ గుంటి గాదు కురూప గాదు
వారసతి యై గడించు నీవయసునందు
దేశమున భిక్ష మెత్తుకో దీని కేల
మనసు గట్టివిర క్తిఁ బొందినది గాక. 105

—విప్రనారాయణుఁడు దేవదేవిదాస్యం బంగీకరించుట.—

తే. దాస్యవృ త్తికి నిటువంటిదానిఁ జేర్చు
కొనఁ గొదువ లేదు వలదు పొ మ్మనఁగ నేల
యిది యదృచ్ఛా ప్తలాభ మై యొదవెఁ దోఁట
పనికిఁ జేదోడు వాదోడు పాటుపడును. 106

క. బరవసముతోడఁ బని కొ
క్కరుఁడును బొరలంగ నీపె గలిగె సహాయం
బిరుపురము నై న రంగే
శ్వరుకై ంకర్యంబు నిర్విచారత సాగున్. 107

వ. అని తలంచి యమ్మెలఁత కి ట్లనియె. 108

తే నెలఁత! సుకుమార మైనది నీదు మేను
తోఁటపని సేయు నెడఁ బసాపాటు మాధు

కరము మాతోడిలంకె నీకరణి నుండ
నోపుదే యన్న నతని కయ్యువిద యనియె. 109

తే. అనఘ! జాత్యభిమాన దేహాభిమాన
లేశములు దాసురాలికి లేవు మాధు
కరము నలవాటె మీవంటిఘనులు దిద్దు
పనులు సేయుటకంటె శుభంబు గలదె. 110

సీ. మా ల నెక్క నేరను గాని పువ్వులుగోయ,
దండలు గట్ట వింతలుగ నేర్తు
నేత మెత్తంగ నేర నింతియ కాని నే,
గట్టిగా నీ ర్శళ్ళఁ గట్ట నేర్తు
ధరణి గుద్దలి పట్టి త్రవ్వ నొక్కటి నేరఁ,
గాని నే మళ్ళచ్చుఁ గట్ట నేర్తు
బరవసంబునఁ జేనిపని నేరఁ గాని నే,
నింటిలోపలి పను లెల్ల నేర్తు

తే. బుద్ధిమతిఁ జెప్పి న్వాసులు దిద్దుకొనిన
సేవనికి నైన దాసురా లోపఁ గలదు
అర్థి మాఅటరంగేశుఁ డైన నిన్నుఁ
గూర్చి వచ్చితిఁ గరుణ నీడేర్చు నన్ను. 111

సీ. నిర్వాణరాజధానికి నేగువారికిఁ,
జక్కనిత్రోవ యాచార్యసేవ
విరజానదీసముత్తరణంబునకు మనో,
జవ మైన నావ యాచార్యసేవ
త్రిజగజ్జనులకు సతీపతిన్యాయ మై,
చాగినత్రోవ యాచార్యసేవ

అజ్ఞానహతులను విజ్ఞానులను జేయు,
సంజీవినీవ యాచార్యసేవ

తే. యాశ్రయించిన వారల కర్థి నిచ్చు
విష్ణుసాలోక్యసారూప్యవివిధదివ్య
భోగసామ్రాజ్యవైభవాభోగమహిమ
శాశ్వతంబైనదేవ యాచార్యసేవ. 112

తే. అనిశ మాచార్యసేవ గల్గినజనులకు
దేవభూదేవతీర్థసంసేవ లేల
అనిశ మాచార్యసేవ గల్గనిజనులకు
దేవభూదేవతీర్థసంసేవ లేల. 113

తే. అనుచు శ్రీవైష్ణవకథారహస్యధర్మ
మార్యు లెన్నుటఁ జేసి యాచార్యబుద్ధి
మిమ్ము సేవింప వచ్చితి నెమ్మి వెరవుఁ
గఱపి పనిఁ గొను మెద నఱమఱలు లేక. 114

క. తిరుకట్టెసేవఁ జేసెదఁ
దిరుమాళిహా నలికి వ్రాసి తీర్చెద ముగ్గుల్
తిరువంజనంబుఁ దీర్చెదఁ
దిరువుట్టము లుతికి వేగఁ దెచ్చెద దినమున్. 115

క. అన విని యతఁ డవ్వనితం
గని యప్పలుకులకు నలరి కామిని! రంగే
శుని కైంకర్యము చేకొని
మన మిరువుగఁ జేయుదము సమంచితభక్తిన్. 116

ఆ. అని తదీయదాస్య మంగీకరించె న
ద్దాసరయ్య యచట నాసరోజ

తే. ధాన్యముష్టి గులా మెత్తి దాన నిత్య
మేకతంబునఁ దా స్వయంపాక మాచ
రించి సాపాటు సేయుదు నంచు నతని
మొఱఁగి తనయింటి కేగి ముమ్మఱు భుజించు. 122

ఆ. చెఱఁగు మాసినపుడు మఱుఁగున మూన్నాళ్లు
నొదిగి యుండి నాలవదివసమున
నొరులు వోయునట్టియుదకంబునను దీర్థ
మాడి పిదపఁ దీర్థ మాడు నదిని. 123

వ. అంత. 124

తే. తోయజానన యున్న పానీయములకు
నాస పడ కిట్లు వెల లేని దాసి యగుచు
నెనసి పను లెల్లఁ జేయఁ గన్గొని కృపాప
రాయణుం డైనవిప్రనారాయణుండు. 125

సీ. ఏఁ బసాపడి తోఁట కేతెంచు నందాఁకఁ,
బని సేయుఁ దాఁ బసాపడను బోదు
నేఁ జేతఁ బని పట్టితేఁ జూచి ముందుగాఁ,
దా నందుకొను నొడల్ దాఁచుకొనదు
నే మేల్కనకమున్న తా మేలుకొని దేహ,
శుద్ధి యై తిరుమాళ్ల శుద్ధి చేయు
నే నిద్రఁ బోవుదాఁకా నిద్రఁ బోవ దే,
పని చెప్పునో యని పాయకుండు

తే. విరతి యై నింట వేపుర విడిచి వచ్చి
తోఁటపనిపాటు కొదిగి నాతోఁ బ్రయాస

లోచనయును బ్రాంతిలోఁ జేవ చొచ్చిన
గతిఁ బ్రవేశ మంది ప్రతిదినంబు. 11

వ. ఇట్లుపచరించుచు నతనికి నయ్యతివ యిట్లనియె. 11

క. ధరలో మాఱటరంగే
శ్వరుఁడవు దాసులకు నీవ సంతతముగా దే
వరకైంకర్యము మన్మథ
గురుకైంకర్యంబు దీనఁ గొదవయె నాకున్. 11

సీ. అరుణోదయంబున కటమున్న మేల్కాంచి,
నది కేగి యాచమనంబుఁ దీర్చి
మజ్జనం బాడి నామము జాఁదుకొని యాత్మ,
వస్త్రంబు నతనిదోవతియు నుతికి
తిరువంజనముఁ జేసి తిరుమాళ్గ కస వూడ్చి,
యలికి ముగ్గులు వెట్టి యతఁడు మేలు
కని వచ్చునపుడు గన్గొని వందన మొనర్చి,
యాచరణీయకృత్యంబు లడిగి

తే. యతఁ డనుష్ఠాన మొనరించి యరుగుదెంచు
వేళ కారామవాటిఁ గ్రొవ్విరులు గోసి
సరులు దండలుఁ గావించి సజ్జనించి
యతనిముంగట నుంచు నిట్లగునె యంచు. 12

తే. మెలపుతోఁ జెట్లపాదులఁ గలుపుఁ దీయు
నెమ్మి దోహదధూపధూమమ్ము లిడును
సందెప్రొద్దైనఁ గసవూడ్చు మందిరమునఁ
దిరువళకు వెట్టు నెరవు రాతిరులు దాఁచు. 12

తే. ధాన్యముష్టి గులా మెత్తి దాన నిత్య
మేకతంబునఁ దా స్వయంపాక మాచ
రించి సాపాటు సేయుదు నంచు నతని
మొఱఁగి తనయింటి కేగి ముమ్మఱు భుజించు. 122

ఆ. చెఱఁగు మాసినపుడు మఱుఁగున మూన్నాళ్లు
నొదిగి యుండి నాలవదివసమున
నొరులు పోయునట్టియుదకంబునను దీర్థ
మాడి పిదపఁ దీర్థ మాడు నదిని. 123

వ. అంత. 124

తే. తోయజానన యన్నపానీయములకు
నాస పడ కెట్లు వెల లేసి దాసి యగుచు
నెనసి పను లెల్లఁ జేయఁ గన్గొని కృపాప
రాయణుం డైనవిప్రనారాయణుండు. 125

సీ. ఏఁ బనా పడి తోఁట కేతెంచు నందాఁకఁ,
బని సేయుఁ దాఁ బనాపడను బోదు
నేఁ జేతఁ బని పట్టి తేఁ జూచి ముందుగాఁ,
దా నందుకొను నొడల్ దాఁచుకొనదు
నే మేల్కనకమున్న తా మేలుకొని దేహ,
శుద్ధి యై తిరుమాళ్హ శుద్ధి చేయు
నే నిద్రఁ బోవుదాఁకా నిద్రఁ బోవ దే,
పని చెప్పునో యని పాయ కుండు
తే. విరతిమై నింట్ల వేవుర విడిచి వచ్చి
తోఁటపనిపాటుఁ గొదిగి నాతోఁ బ్రయాస

పడుచు నున్నది పరదేశి పడుచు దీని
సాఁక కున్న నుపేక్షోపచార మొదవు. 126

వ. అని తలంచి యద్దేవదేవిం గనుంగొని. 127

చ. లలనరొ! యెందు నీ విఁక గులామునకుం జనవద్దు మాకుని
చ్చలు పెరుమాళ్లకోవెలఁ బ్రసాదముకట్టడి సాగి వచ్చు నా
తళియప్రసాద మీవు సతతంబుఁ బసాపడుమన్న మ్రొక్కి యా
మ్మెలఁతుక స్వామి! చిత్తమని మేకొని యున్ముదితాంతరంగయై.

వ. అంత నవ్విప్రనారాయణుండు. 129

తే. తనకుఁ గోవెలపడి ప్రసాదము నిరంత
రంబుగా సాఁగి వచ్చు శ్రీరంగవిభుని
పళ్లెరంబు ప్రసాదంబు ప్రతిదినంబు
ప్రొద్దుప్రొద్దున రేపుమాపులును దెచ్చి. 130

క. కూరలు నన్నముఁ దిరుప
ణ్యారముఁ బచ్చళ్ళుఁ దిరుకణామధు మధురా
హారములు నవ్వధూటికి
సౌరుచి ముప్పూటలును బసాపడఁ బెట్టున్. 131

ఆ. తాను మాధుకరము మానక యెప్పటి
యట్ల వైష్ణవాలయముల కరిగి
రంగవసతిఁ దిరువరంగంబె కోవెల
యనుచు భిక్ష మెత్తుకొని భుజించు. 132

ఉ. ముద్దియ యుణ్ సదా యతని మ్రోలఁ బిఱిందికడణ్ గెలంకులం
బ్రొద్దొకచాయ వర్తిలుచుఁ బూవిలుకాని ప్రయోగభూతమై
యెద్దెసయుం బ్రవేశమున కించుక యేనియు సందులేమిఁ బె
ల్లొద్దిక రంధ్ర మారయుచు నుండెఁ దవేకపరాయణస్థితిన్.

సీ. మూఁపుపైఁ గురులు క్రొమ్ముడి సేయు నొకవేళ,
నొకవేళఁ జెంపకా ప్వారఁగ దిద్దు
వెలి నాభి దోఁప నీవి సడల్చు నొకవేళ,
నొకవేళఁ గంచుకం బూడ్చి తొడుగుఁ
దొకతొక నాడు ముద్దులమాట లొకవేళ,
నొకవేళఁ బాలిండ్లు లోనర నెరవు
వలిపెంబుఁ గట్టుఁ బావడలేక యొకవేళ,
నొకవేళఁ బయ్యెద నోర చేయు
తే. గదిసి పీనులు సొక్కఁ జొక్కముగఁ బల్కు
నొయ్య నొయ్యన సంగీత మొక్క వేళ
సకియ యస్ఖలితబ్రహ్మచారి యైన
వైష్ణవోత్తము మోలి లావణ్యలీల. 134

వ. ఇవ్విధంబున. 135

క. వటుమానససుక్షేత్రముఁ
గుటిలాలక చేష్టితములగుద్దలిఁ గొని యి
ట్టటు పాదు చేసి మోహపు
వటబీజము మరుఁడు నాటి వర్ధిలఁ జేసెన్. 136

క. ఐహికసౌఖ్యంబుల ని
స్పృహుం డగువటుని కత్తరుణి సద్హాస్య
స్నేహం బతిపరిచయమున
మోహం బై బుద్ధిచలనముం జేయుటయున్. 137

సీ. ఆకాంక్ష తెప్ప వేయక చూచు ననిశంబుఁ,
దలఁపుచేత నె తృప్తిఁ గొలువు మదికి

వనజాక్షి కొంగు సోఁకిన మేను గరుబాల్చు,
మొగము విప్పఁగఁ జేయు మగువ నగిన
నర్థి నొయ్యనఁ గోర్కి నడుగ నుద్యోగించు,
నడుగఁ జాలమి నేఁటి కనుచు మానుఁ
జెలిపల్కు మెచ్చి కోయిలపల్కు దూషించు,
నధరంబుమధువున కాసఁ జెందు
తే. శిరసుపైఁ బేనుఁ బొడగన్నఁ జేరఁ బోయి
హింస సేయకు మని చేతి కిచ్చుఁ దిగిచి
తన్మయత నొంది కలికిచేతఁల నా హరిప
రాయణుం డైనవిప్రనారాయణుండు. 138

శా. ఆవిప్రోత్తమువజ్రపంజరనిభం బై నిశ్చలం బైనస
ద్భావం బంగనసాహచర్యగుణసంపర్కంబునన్ లోహ మై
గ్రావం బై దృఢదారు వై తరుణవృక్షం బై ఫలప్రాయ మై
పూవై తన్మకరందమై కరఁగెఁ బోఁబో నీళ్లకుం బల్చనై.

తే. గారఁ ద్రావినమీనుసంగతి మనోజ
వేదన నతండు పొరలఁ దన్వియు నెఱింగి
తనవలకుఁ జేరెఁ బో బోఁడిదాస రనుచు
డెందమునఁ జాల సంతస మందె నంత. 140

## వర్షర్తువర్ణనము.

తే. రంగవిభునకు విప్రనారాయణుండు
చేయుతోమాలికలకుఁ జాంపేయకములు
వేసవి యొసంగె నని మొగు ల్వీరు లొసఁగ
మతిఁ దలంచెను దరువాతిఋతు వనంగ. 141

సీ. చాతకవ్రజపిపాసావ్రతోద్యాపనా,
కార్యనిర్వాహకాచార్యవరుఁడు
భూపురంధ్రీగ్రీష్మతాపజ్వరప్రణా,
శనరసౌషధ చికిత్సావిదుండు
మహనీయభూమిభృన్మహావిహారిమయూర,
సందోహనటనదీక్షాగురుండు
శతపత్రమిత్రాపహృతజగజ్జీవన,
ప్రత్యర్పణక్రియాప్రథితదాత
తే. మొనసి నీరంధ్రబంధురామోఘమేఘ
జాతసంజాతవృష్టిసంఘాతవారిప్ర
భూతభూతలశీతలవాతధూత
నాప్తహర్షాగమంబు వర్షాగమంబు. 142

తే. ఆన మాయుష్షు లేక పోతేని యనుచు
ధరణిపంపున దోలుకారుతేరువు కాఁడు
నింగి గుడి వ్రాసి యూఁగిన భంగి నవుడు
చండకరుఁ డుండెఁ బరివేషమండలమున. 143

వ. అంత.. 144

శా. పార్థక్ష్మాఖలదిక్తటిత్పటుతటప్రద్యోతవిద్యోతితా
వ్యర్థోగ్రాశనిపాతజాతఘనగర్జాడంబరవ్యాప్తి న
త్యర్థంబుగ ధరణీజనంబు చకితంబై "యర్జునః ఫల్గునః
పార్థఃకృష్ణ"యనగ ధరిత్రిఁ దొరఁగెగ బ్రత్యగ్రవార్బిందు [వుల్.

క. కటపెట తోటతోట రాలెడు
పొటపొటచినుకుల ధరిత్రి పొడనట్టువడగ

పాటపాట నాఁకట పోలుచుఁ
దటతట పడుచాతకముల దైన్యము వాసెన్. 146

శా. అంభోదప్రకరంబు లత్తఱి సముద్యద్దీర్ఘనిర్ఘాతసం
రంభాఘాతవిభగ్నదిఙ్నగకఠోరగ్రావఖండావలీ
దంభాంభశ్చరవాహినీకలుషపాథశ్శుంభదంభోళులై
కుంభద్రోణము గాఁగ వానఁ గురిసెన్ ఘోరాంబుధారా
[కృతిన్. 147

క. తోరము లగునవ్వర్షా
వారములం దొక్కనాఁ డవారితధారా
సారంబు పయోధరముల్
ఘోరంబుగఁ గురిసె ముసుగుకొని నిశదాఁకన్. 148

క. ఆనిశవేళఁ దనచవిక
లోనిచిఱుతయురుఁగుపైని లోలత వటుఁడున్
వాన పయిఁ జిలుక వాకిటి
తీనియపైఁ జేరి దేవదేవియు నుండెన్. 149

శా. యాదోరాశివిశేషణోదితవృగంతారుణ్యతారుణ్యవ
ద్వైదేహీవరణప్రరక్షణధనుర్వాదిత్రవాదిత్రయీ
శైదంపత్యవిధానదానగరిమా సర్వజ్ఞ పాదానతా
ర్త్యాదిత్యర్థగతా సురేశ్వర నివాసా రక్షసారక్షమా. 150

క. అలఘూకృతగుహాభక్త్యు
త్కలితాంగ హృదంగకమలతరణివిధానా
ఫలముఖకలితసుముక్తా
ఫలదంబునిదాన! దీనభక్తాధీనా! 151

మాలినీవృత్తము.

అనుజభృతశరాసా! యాశ్రితాసన్నిరాసా
మనుజకనకవాసా! మంజునాకేతవాసా
యనుస్మృతనిజదాసా! యర్థ్మకార్యానువాసా
యనుపమదరహాసా! యాతుభిచ్చంద్రహాసా. 152

గద్యము. ఇది శ్రీమదాపస్తంబసూత్ర భారద్వాజగోత్రపవిత్ర శ్రీరామచంద్రకరుణాతరంగితవైభవ సారంగునృసింహమంత్రితనూభవ పరిచిత భగవద్భాగవత కైంకర్యవిధాన తమ్మయాభిధానప్రణీతం బైన వైజయంతీవిలాసంబున ద్వితీయాశ్వాసము.



శ్రీ ర స్తు.

# వైజయంతీవిలాసము.

## తృతీయాశ్వాసము.

---

క. శ్రీజానకీవిలాసో
త్తేజకసచ్ఛ్లాఘ! వసుమతీదోర్వ్యాపేటీ
రాజత లేపాయితజిత
రాజశతయశశ్శకలాప! రఘుకులదీపా! 1

వ. అవధరింపు మట్లు నిర్ఘళధారావర్షంబు గురియుచుండఁ
దీనియపై దేవదేవి యుండుట యెఱింగి యప్పు డవ్విప్ర
నారాయణుండు. 2

ఉ. వారిజపత్ర నేత్ర నిటు వాననెపంబున నింటిలోనికిం
జేరఁగఁ బిల్చి నాతలఁపుఁ జెప్పినఁ జేకొనకుండిన న్బలా
త్కారముదోషమంచుఁ బలుకంబరభామినిగాదు చెంతకుం
జేరినమీఁదఁ గుక్కుటము సేయునుపాయముఁ జేయుటొప్పు
[గున్. 3

క. అని తా నయ్యువతిం గని
వనితా! చలి నుండ నేల వాకిటికడ వె
చ్చనితావున కిటు ర మ్మనఁ
జని తా నాలోనిగడపచక్కి నె యున్నన్. 4

క. అయ్యెడ మిక్కిలి శైత్యం
బియ్యెడ కేతెమ్ము నీవు నింతి నివాతం,

బయ్యెన్నది యిచ్చో ననఁ
దౌయ్యాలి యాబ్రహ్మచారితో నిట్లనియెన్. 5
ఉ. ఆరయఁ బెక్కువాసరము లాయెను నేనిటవచ్చి యెన్నఁడుం
జేరఁగ రమ్ము! నీ వని స్పృశించుటలే దిది యేమి నాపయిం
గూరిమి లేఁదు మీాసరసకుం జనుదెమ్మని యానతిచ్చు టో
సూరివరేణ్య! నన్నరసిమాచుటకో మతినిక్కమోయనన్.

విప్రనారాయణుఁడు దేవదేవితోఁ దనమనోరథము సూచించుట.

ఆ. నిన్ను నౌరసి చూడ నున్నదే పదియాఱు
వన్నెపసిఁడి కొదువ లెన్నఁ గలదె
మాయభీష్టమైనమాట చల్లకు వచ్చి
ముంత దాఁచ నేల యింతి వినుము. 7
క. సరసిజముఖి! పంచాయుధ
గురుకైంకర్యంబు మనసు గురువై చెప్పన్
సరి నింకొకపంచాయుధ
గురుకైంకర్యమున నీవు గురు వగు మనుడున్. 8
ఉ. ఆసరసీరుహాక్షి నతఁ డమ్మెయి నాడిన మన్మథార్తవా
చాసరణిం గడు న్నిజవశంవదుఁ డౌట యెఱింగి 'చిక్కెరా
దాసరిబోడి యిప్పుడు గదా! తలయెత్తి మెలంగఁ గల్గుటల్
నాసరివారిలో' నని మనంబు ఘనం బగు వేడ్క నుబ్బఁగన్.
చ. ఎనసి మనంబునం బతుల కింతులకు న్వల పంకురించినం
గొనకొని ధాత్రి నేస్తులకుఁ గొమ్ములు వచ్చినయట్టు లింక ని
ప్పనికిఁ బ్రసూనసాయకుఁడె పైతరు వే మన నీక వీనిఁ జెం
దిన వలరాచవెఱ్ఱి తరితీపులచేఁ దల కెక్కఁ జేసెదన్. 10
వ. అని యూహించి యతని కిట్లనియె. 11

తే. అనఘ! మీతిరువడిగళే నాశ్రయించి
నపుడె మద్దేహజీవధనాదికములు
తావకాధీనములు గావె దాని కేమి
విన నవధరింపు మీదాసివిన్నపంబు. 12

శా. క్షేత్రజ్ఞప్రకృతిస్వరూపవిదు లక్షిఘ్రాణజిహ్వాత్వక్
శ్రోత్రోద్భూతసుఖవ్యపేతు లురువిష్ణుధ్యానపారాయణుల్
మిత్రామిత్రసముల్ భవాదృశులు స్వామీ! ప్రాకృతుల్ వోలె ని
మ్మాత్రద్వారము పేరిఘోరనరకంబుం జేరఁ గాంక్షింతురే.

క. పరకాంత దోష మటుపైఁ
బరికించిన శూద్రజాతిఁ బడపుసతి న్నే
వరదాసి నీవు మాంజీ
ధరుఁడవు వైష్ణవుఁడ వంటఁ దగునె మహాత్మా! 14

ఉ. 'విప్రకులావతంస! పృథివీస్థలి నిట్లపవిత్రురాల వి [దుర్
ష్ణుప్రతిమాను నేక్రియ నినున్ స్పృశియింపఁగ నేర్తు' నావు
విప్రులఁ బొందిరేని యపవిత్రులు పూజ్యు లటన్న భారతీ
యుప్రథితోక్తి గాదె వనితా! పరిహారము నీదుశంకకున్.

శా. దాసీసంగతుఁ డైనవ్యాసు గురుకాంతాగామి శీతాంశు వే
శ్యాసాఖ్యాన్వితుఁ డైనకౌశికుని శూద్రాపత్యకన్యారతి
వ్యాసక్తుం డగునప్పరాశరుని నేవా రైన వెల్వెట్టిరే
నీసంగంబున వారి కైనగతి తన్వీ! నాకుఁ గానిమ్మికన్. 16

వ. అనినఁ గ్రమ్మఱ నమ్మగువ యిట్లనియె. 17

ఆ. నిడుదపట్టె తిరుమణియు వైష్ణవము గాఁగ
మీర లాడుమాటతీరు చూడ

ననఘ! నాసలు బత్తుండను నోరు తోడే ల
టన్నరీతి దోఁచు చున్న దిపుడు. 18

చ. పడపున కేన్సృజించె మును పణ్యావఘాటుల బ్రహ్మ యట్టివం
గడమునఁ బుట్టి యున్నఁ గడఁగాదని రోసితినేను నీవయో!
వడుగవు బ్రహ్మనిష్ఠుఁడవు వైష్ణవధర్మవిదుండ వాపనుల్
నుడువ జుగుప్స పుట్టకిటునోరెటులాడెఁదలంపుమామదిన్.

తే. తోన యాదూఢపాతిత్యదోష మిందు
సంభవించు భవద్బ్రహ్మచర్యమునకు
వైష్ణవోత్తమ! నా కిందువలనఁ జిక్కు
మొదలిపాటుకు వచ్చినఁ గొదువ లేదు. 20

తే. అనఘచారిత్ర! శ్రీవైష్ణవాపచార
మెట్లు సేయుదు మి మ్మంటి యే నటన్న
భావభవపుష్పభల్లధారావిపన్న
హృదయుఁ డై తో య్యలికి నతఁ డిట్టు లనియె. 21

క. అపచారము గా దిది మా
కుపచారమె కాని యోతలోదరి! సమ్య
క్కృపచేఁ గైకొని శంబర
రిపుచేఁ జా కుండ నుద్ధరింపుము నన్నున్. 22

క. ఓసతి భగవత్సేవకు
వాసి గణింపంగ భాగవతసేవయుత
ద్దాసులకైంకర్యముఁ గృపఁ
జేసిన రంగేశ్వరునకుఁ జేయుటె సుమ్మీ. 23

వ. అనిన నమ్మాటకు మందస్మితసుందరవదనారవింద యైయిం
దువదన దేవరచిత్తంబు కర్తవ్యం బెద్ది యనిన. 24

విప్రనారాయణుఁడు దేవదేవిం గవయుట.

క. తిరువళికు మఱఁపు మనవుడుఁ
దిరువళికు మఱంచి నవుడె దేవరదాసీ,
దిరువడిఘళ్ కైంకర్యముఁ
బరువడిఁ గావించు టెట్లభాసముగాదే. 25

క. దీపము మన్మథగాగో
ద్దీపము లక్ష్మీకరము మదికి భయహార మౌ
దీపము లేనిరతు ల్సుఖ
లోపము లవి చీఁకటింటిలో వెకిరింతల్. 26

వ. మఱియును. 27

క. ఆడెడుకొమ్మపదంబులుఁ
బాడెడుకలకంఠమోము భావజుకేళిం
గూడెడుసకియలచోటుల్
చూడక రహి పుట్ట దండ్రు సుగుణులమదికిన్. 28

వ. అనిన నతం డిట్లనియె. 29

క. ఏపనులకు దీపము దగు
నీపనులకుఁ దగ దటన్న నింతి యిటు లనెన్
దీపంబు మఱఁప వల దా
దీపము మనసందు చీర తెర సారింతున్. 30

క. నావుడు నది లెస్స యదే
కావింపు మన న్నిజాంశుకమ్ము విడిచి రా
జీవనయన దిగ్గున న
ద్దీవియకుం దనుకు నడుమఁ డెర వైచుకొనున్. 31

క. వలిపెంపుఁజీర తెరలో
పలిదీపచ్ఛాయ వారిపై నవ్వేళం
బలపల నై రాఁ దెరకును
వెలుపలఁ బ్రసరించె లేఁతవెన్నెల పోలెన్. 32

క. తెలుప తెరపై చునెపమున
నెఱిఁ గట్టినచలువ విడిచి నిలిచినఁ గడు న
త్తఱి మెఱసె నొఱకుఁ బాసిన
కఱకంఠునరాతిచేతిఖడ్గముఁ బోలెన్. 33

వ. ఆసమయంబున. 34

సీ. వెదఁ జేయ నద నైన మదనుక్రొవ్విరిచేన,
దార్కొన్నహారిణిపదం బనంగ
ననివిల్తుకేళీవనముచక్కిఁ జూపట్టు,
తరుణారుణాశ్వత్థదళ మనంగ
దర్పకాలయబహిర్ద్వారతోరణమునఁ,
దళుకొత్తుమించుటద్దం బనంగఁ
గందర్పదేవుశృంగారంపుఁదోఁటలోఁ,
బొలుపారుదింటెనపు వ్వనంగ

తే.నతనుఁ డంగడి నమ్ము మోహానవుఁబనస
తొన యనఁగ దీని కిల లేదు తుల యనంగఁ
దగినవస్తువుఁ జూచె నమ్మగువమేన
బలిత మగువాంఛఁ గూరి యాబ్రహ్మచారి. 35

ఉ. చూచినయంతలోఁ దనకుఁ జొప్పడుదాఁక నధిజ్యధన్వుఁడై
లాచినమన్మథుండు కరలాఘవ మొప్ప నిశాతపుష్పనా

రాచపరంపరల్ పఱపి వ్రయ్యలు చేసె దదీయశీలమున్
గాచినధైర్యవజ్రమయకంటకమున్ బటుశౌర్యధుర్యతన్.

వ. ఇట్లు విగతధైర్యం బైన యవ్విప్రవర్యుం డయ్యతివ
కిట్లనియె. 37

తే. కొమ్మ! నీమోవియమృతంబుఁ గ్రోలకున్నఁ
బ్రాణములు నిల్వ వతనుతాపమున మేన
దయ నొసఁగు 'బ్రాహ్మణో న హంతవ్య' యనిన
వాక్య మూహింపు నావుడు వనిత పలికె. 38

తే. విటజనోచ్ఛిష్ట మైనట్టివేశ్యమోవి
వేదపారాయణాతిపవిత్ర మైన
వైష్ణవాస్యంబు నె ట్లంట వచ్చు ననిన
వలపు దొలఁగాడఁ బలికె నవ్వైష్ణవుండు. 39

క. ఆవులవెన్కయు ధరణీ
దేవులపాదములు యతులదృక్కులు కవినా
చావృత్తి వహ్నివాజి
స్త్రీవదనంబులు కదుర్ శుచిత్వపదంబుల్. 40

వ. అదియునుంగాక. 41

క. మృగయావిహారవేళల
మృగదంశకవక్త్రములును మీనాంకాజిన్
మగువలవదనంబులు శుచు
లగు నుచ్ఛిష్టత్వ మంట దప్పనిపట్లన్. 42

క. అని ధర్మశాస్త్రసూక్తులు
మనుముఖ్యస్మృతులు తెలువు మానిని! యిఁక నీ

వనుమానము మాని వెసఁ
నను మన్మథకేళి నేలు నాపుడు వేడ్కన్. 43

క. నారీమణి యవ్విటుని మ
నోరథమును గూడి నిజమనోరథ మొనరం
దారసిలి కౌఁగిలించెను
మారశిలీముఖభయంబు మదిఁ బో నతనిన్. 44

వ. అంత. 45

సీ. ఆత్మహస్తమునఁ బంచాయుధచిహ్నము,
లాబాహుమూలంబులఁ బాదుకొల్పి
దల మైనచెమటబొ ట్టిలమితోఁ జె న్నొంద,
నలికభాగంబునఁ గలుగఁ జేసి
జమిలిరేఫలకు దీర్ఘము లిచ్చి నైచ్యభా,
వంబుగా దాసనామంబుఁ జేసి
మానిదుర్లభ మైనమణితమంత్రరసంబు,
శ్రవణసంగతి రహస్యముగఁ బలికి
తే. నెమ్మి రతిదేవపూజాక్రమమ్ము దెలిపి
యఖిలసంస్కారములు నిటు లాశ్రయించి
మన్మథవ్రాత్యుఁ డైనయమ్మాణవకుని
మృగవిలోచన నిజశిష్యునిగ వరించె. 46

క. వటుఁ డైనవైష్ణవుని నిటు
విటుఁ జేసెం దేవదేవి వెడమాటులచే
నటు శయ్యఁ జేరఁ గలిగిన
నెటు సేయఁగలేరు వేశ్య లిల మగవారిన్. 47

క. కాయజుఁడు చేయుమాయల
కాయజుఁడు హరుండు నంబుజాక్షుఁడు లోనై
తోయజనయనలఁ బాయరు
హేయజనుల్ నరు లనంగ నెంత ధరిత్రిన్. 48

తే. మున్ను కందర్పవిశిఖనిర్భిన్నహృదయుఁ
డగుచు దిన మొక్క కల్పమై యార్తిఁ బొరలు
విప్రనారాయణునకు నవ్వేలఁది సురత
లీల నారాత్రి నిమిషంబుఁ బోలి గడచె. 49

వ. ఇవ్విధంబునఁ గతిపయదినంబులు గడచినయనంతరంబున నామానినీమణియందుఁ బ్రేమాతిశయంబున నవ్విప్రనారాయణుండు. 50

సీ. దినముఁ జన్నీళ్ళ మజ్జన మాడఁ జలి దాఁకు,
నీ కంచు వేన్నీళ్ళ నెమ్మిఁ గాఁచు
బుధవారశనివారములు బీరువోకుండ,
శిరసంటు వెచ్చఁగాఁ జేసి నూనెఁ
జమురు పట్టించి యంగములు మర్దన చేయు,
మేదించు మేనిపై మినుపపిండి
తల నిమ్మపండ్లు జొబ్బిలఁ బిండి సీకాయఁ,
బులిమి తైలవుజిడ్డు వోవ దువ్వి
తే. జలక మాడించు మడుఁగుసాల్వాలు ధరింపఁ
జేయు శిర సార్చుఁ గొమ్ముడి వేయు విరుల
సరులు పైఁజుట్టి తిరుమణి చాఁదుకొనిన
దాఁక నిలుచుండు నెదుట సద్దంబు పూని. 51

వ. ఇట్లు నిజసేవాపరాయణుం డైన యవ్విప్రనారాయణు మోహాతిరేకంబుఁ గనుంగొని జనితామోదంబున నవ్వని తావతంసంబు. 52

ఉ. వైపరి తోఁటినైష్ఠికవువర్తన లన్నియుఁ గట్టిపెట్టి తా నాపరిచర్యఁ జేసెదు దినంబును దాసరి దాసరీతి నే నీపరిపాటి దార్చ నగు వింటికి పీనిఁ దటాల్న మత్ప్రతి .జ్ఞాపరిపూర్తి యయ్యె నిఁక జాడ్యము సేయఁ బనేమి
[యిచ్చటన్. 53

వ. అని తలంచి యవ్విప్రనారాయణుం గనుంగొని యవ్వరా రోహ యిట్లనియె. 54

క. సామి! యలకరించినుం డిట
నే మీతిరువడిఘు శాశ్రయించుట విని వు
త్రీమోహంబున ముప్పది
యామడ మాయమ్మ వచ్చినది నసుఁ జూడన్. 55

తే. వచ్చి యిప్పుడు మాయుప్పవద్ద నున్న
దంచు నీప్రొద్దు వింటి నేఁ డటకుఁ బోయి
యెల్లి వచ్చెద నిక్కడఁ దెల్లవాఱఁ
బోయివత్తునె యనుడు నబ్జాభసురునకు. 56

తే. జల్లనియె గుండె ధాతువు ల్వల్లటిల్లె
మొగముపస చెడె దేహంబుబిగువు సడలె
స్వాంతము గలంగెఁ జేకాళ్ల శైత్య మొదవె
నోడలు చెమరించె నుఱుమాట వెడల దయ్యె. 57

వ. ఇట్లు గుండె జల్లన వివర్ణ వదనుం డై మూర్ఛిల్లినయ ట్లుండి కొండొకసేపునకుఁ దెలి వొంది తెప్పిరి దప్పికేఁ బాసీ

యంబు లాని సేదఁదేఱి పైవలిం గనుంగొని దీనాలాపం
బుల నిట్లనియె. 58

తే. నీవు నీవారియింటికి నేఁడు పోయి
రేపు వచ్చెద నంటివి రేయి నాల్గు
జాలు నినుఁ బాసి యెట్లుందు నోలతాంగి!
యేను వచ్చెద వెంటనే యింటి కనిన. 59

క. ఏ వెలఁతు మిమ్ము రమ్మన
దేవర వేంచేసిరేని తిరువడికుకు నే
సేవింపఁగ బనివినియెద
భావింపఁగ నింతకంటె భాగ్యము గలదే. 60

విప్రనారాయణుఁడు దేవదేవియింటి కేగుట.

క. వేంచేయుఁ డనినఁ దెలివి జ
నించెఁ మోమునకు మనసు నిర్మల మయ్యెం
జాంచల్య ముడిగె నొయ్యనఁ
బంచప్రాణములు డిందుపాటును బొందెన్. 61

వ. అంత. 62

ఆ. ఇనుపకలప నొక్క యిక్క నిక్షేపించి
కంపక్రిందఁ గొయ్యకలప మాటి
చేఁద బొక్కెఁ బొదను జేర్చి భాండంబుల
లోఁతునీళ్లమడుఁగులోన ముంచి. 63

చ. వటుఁ డపుడాత్మమందిరకవాటము పాటముగా ఘటించివె
ల్పటనొకత్రాటఁ గట్టి పదిలంబుగఁ దాళముపెట్టి తోఁటవా
కిట బలుగాడికి న్గడె బిగించి వెలిం బలుకంప నాటి మి
క్కుటముగఁ జంకన త్తిరిపెగూడ ధరించి సరించి వెంబడిన్.

సీ. శ్రీవైష్ణవులు నిరీక్షించిరా తిరుమణిఁ,
దుడిపింతు రన్నట్టిజడుపు మాని
స్మార్తులు చూచిరా సభఁ బరిహాసంబుఁ,
జేయుదు రన్నట్టిసిగ్గు విడిచి
బాంధవు లిరవిరా యవా జ్ఞేయుఁ డని యిల్లు,
చేరం నీరన్నవిచార ముడిగి
ప్రభువు లెఱింగిరా యభివాదనమున స,
న్మానింప రనునభిమాన మెడలి
తే. వైష్ణవముఁ బట్టితిరుమణివళముఁ జేసి
బ్రహ్మచర్యంబు జందెముపాలు చేసి
విటజనోచ్ఛిష్ట మైనయక్కుటిలవేశ్య
యంటున నతండు బ్రాహ్మణ్య మంటుపఱచె. 65

క. తోయజభవకులుఁ డాగతిఁ
గాయజుబారిఁ బడి 'కాముకస్య కుతో ల
జ్జా' యనుమాట నిజంబుగఁ
బోయెం దోడుకొని వేశ్య పోయినదారిన్. 66

వ. ఇవ్విధంబున నవ్విప్రనారాయణుండు కురంగనయనపిఱుం దన శ్రీరంగపురంబునకుం జని యందు. 67

## వేశవాటికావర్ణనము.

సీ. వారటధ్వజధను ర్జ్యారటద్భృంగఝుం,
ఝూటఝుంఝుంక్రియాసంకులంబు
లంజకావిటమనోరంజకస్ఫుటవచ,
శ్శృంభలీసంభ్రమోజ్జృంభణంబు

క్రుద్ధవేశ్యాంబికారుద్ధనైజప్రియా,
యల్లకావనిలురత్పల్లవంబు
గోత్రశాలాదివారాత్రమూర్తిభవ,
త్ప్రాసవేషావసథర్మాసనంబు
తే. హారిలావణ్యగణ్యపణ్యాంగనాక
దంబశృంగారచేష్టావిడంబవివిధ
ఖేలనాసాంద్రమదనేంద్రజాలకపట
నాటకముఁ గాంచెఁ బురి వేశవాటకంబు. 68

సీ. కచ్చించి సొగటాలు గణికలతోఁ గుక్కు,
టాండము ల్పణముగా నాడువారు
ద్రవిణము పై పన్నిదము లొడ్డి మాత్సర్య,
గతిఁ గోడిపందెముల్ గట్టువారు
వైచిత్రిగాఁ గోలఁ గాచి పన్నిద మాడి,
చెఱకుమోపులు లీల నఱుకువారు
గుఱి మాపి యట కేగి పఱతెంచునందాఁక,
నొసఁగిన భక్ష్యముల్ మెసఁగువారు
తే. నాఘ్న్యలై గోత్రశాలల నధివసించి
విటుల వేశ్యాజనముల చక్కటులఁ దీర్చు
వారలును గల్గి శంబరవైరిసంత
పేట యన నొప్పు నవ్వేశవాటమునను. 69

సీ. లంబస్తనములు మూలస్థానముల నంట,
గడితంపుఱవికలఁ గట్టి త్రోచి
పుత్రికానిర్మాల్యపుష్పదామంబులఁ,
దొఱ్ఱకొప్పులలోన దోఁపి తురిమి

వృక్కిళ్ళవీడెంపుఁదొక్కు మెండుగఁ జేసి,
కంఠగర్తంబులఁ గావుఁ గట్టి
బొరుసుమోముల బిత్తు వోఁ బచ్చివసపున,
మేదించి నూనెచే మెఱుఁగు పెట్టి
తే. శునకములు దేఱి తమదిక్కు చూడ రోయు
వయసుతో నుందు రవ్వేశవాటియందు
నూనశరభుక్తనిర్ముక్తశుష్కపత్త్ర
భాజనము లై నవృద్ధవేశ్యాజనములు. 70

సీ. కట్టువర్గము లమ్మగారిపుట్టంబులు,
తిలకంబు పూఁతచెందిరపుఁబిండి
కంఠభూషణము లక్కలిదేవిపాదాలు,
భోగవిత్తము హాఁజోగు కొలుచు
లారాధ్యదైవతం బంబికాశక్తియు,
సత్యార్ఘ్యమద్యంబు నిత్యసేవ
శ్రవణీయసుఖగోష్ఠి బవినీలసంగీత,
మెల్లారసివసత్తు లిష్టసఖులు
తే. నగుచుఁ దముఁ జూచి విటజనుల్ నగుచునుండ
నందనలపంచసాయకమందిరములఁ
గాచుజాగిలములు వోలెఁ గాచి యుంద్రు
వేశ్యమాతలు తద్ద్వారవేదికలను. 71

సీ. చిట్టికుంకుమబొట్టుఁ బెట్టునెన్నుదుటికిఁ,
గెంపారుపూఁతచంద్రంపుబొట్టు
జమిలిము త్తెఁపుఁగంటసరి దాల్చుమెడకును,
దట్టంపుఁదోలుపాదాలపోగ్లు

వలిపంపుసన్నచల్వలు గట్టుమేనికి,
మాతపుట్టపువెజ్జి మైలబట్ట
కపురపిడెము వెల్తిగానియాపోరికిఁ,
గొఱమాలినట్టియాగొంటువక్క
తే. కటకటా! పువ్వు లమ్మునంగడినె కట్టె
లమ్మఁ జేసెను మిమ్ము దైవమ్మటంచు
వృద్ధవేశ్యల వగపింతు రుద్ధతప్ర
వర్తు లగుధూర్తవిటులు దుర్వారనటులు. 72

వ. ఇట్లనేకప్రకారంబు లయినవేశ్యవిటప్రకారంబులఁ గనుం గొనుచు నవ్విప్రనారాయణుండు దేవదేవీపురస్సరంబుగాఁ దదీయగృహంబుఁ బ్రవేశించి యందు. 73

సీ. సకినెలపట్టెమంచముఁ బట్టుతలగడ,
బటువుబిళ్ళలు సూర్యపుటపుఁబఱపుఁ
జేదివ్వెప్రతిమ చౌశీతిబంధములమే,
ల్కట్టు గొజ్జఁగినీటిగాజుకొప్పె
వటివేళ్ళసురఁటి జవ్వాదిపక్కెనతట్టు,
పునుఁగుఁ బింగాణికప్పురపుఁగ్రోవి
గొడుగుఁ బావలు గందపొడిపెట్టె నునుసాన,
గడియార మంచముక్కాలిపీఁట
తే. వెండినాళంబుఁ బటికంపుగిండిచెంబు
జాలవల్లిక పైఁడిబాగాలబరిణె
పంజరశుకంబు మణితళ్ళములఁ బఠించు
పావురపుజోడుఁ గలరతాగారమునను. 74

తే. దేవదేవీసమేతుఁ డై భావభవవి
హారగతి నుండె నన్యవిచార ముడిగి
ప్రతిన నీడేర్చుకొని యు నంచితవసంతప్ర
మోదపరిపూర్తి నుండె నప్పైదలియును. 75

క. అటు దేవదేవి యవ్విటు
విటుఁ జేసె నటన్న వార్త వినినప్పుడె కా
ర్పటికగతి దాసురాలై
తటుకున నయ్యప్పు లంజెతనముం బాసెన్. 76

క. కుందంబుల నలుగనియర
విందంబుల నరసి రంగవిభుపూజకు నే
నందంబులు సేయుదు నను
చందంబున నేగుదెంచె శరదృతు వంతన్. 77

శరదృతువర్ణనము.

సీ. కార్తికచంద్రవిస్ఫూర్తివక్త్రముతోడఁ,
జంద్రికామందహాసంబుతోడ
హరిదంతరాచ్ఛవిస్ఫురణాంబరముతోడ,
విమలకహ్లారనేత్రములతోడఁ
దారావళీస్వచ్ఛహారావళులతోడ,
నతులరాజమరాళగతులతోడ
నభ్రవిభ్రమకళాదభ్రమధ్యముతోడఁ,
గమలకోమలపదాబ్జములతోడ
తే. వితతసత్కాశచామరప్రతతితోడ
సకలకవిరాజసంస్తుత్యవికలుషైక

జీవనస్థితి నెరసె నానావనీత
లముల శారదసమయవిలాసలక్ష్మి 78

వ. ఆసమయంబున. 79

సీ. ప్రచురమై యొకచోటఁ బాటీరకర్పూర,
కస్తూరికాదులకమ్మతావి
దండిగా నొకచోటఁ బిండివంటలవెంటఁ,
బ్రభవించు తైలాజ్యపరిమళములు
దహి నొకచోటఁ గూరలతాళింపోఁతల,
తోరంపుసంభారసౌరభములు
రమణ నొక్కొకచో సురభ్రాదిమస్తముల్,
గమలించుమాంసంపుగములకమురు
తే. గ్రమ్ముకొని యొక్కచో నంబికాసమర్చ
నాసముద్భూతమైరేయవాసనలును
లంకెఁ దోదోఁపు లాడంగ లక్ష్మిదేవి
పండు గేతెంచెఁ గన్నులపండు వగుచు. 80

వ. ఆదినంబునందు. 81

ఉ. అచ్చినవంక నైనఁ దమ రావల నప్పుల దూసి యైననుఁ
మ్రుచ్చిలి యైన జీవధనము ద్దిగ నమ్ముడు వెట్టి యైననుం
బెచ్చుగ సంతరించి తమపేదఱికంబుఁ దలంప కర్థము
ద్దెచ్చి యనుంగువేశ్యలకుఁదీర్తురు పండుగదండుగల్వేటుల్.

క. మింతజనదత్తమేషీ
కంఠసముద్భూతరవము కడు నెమ్మది ను
త్కంఠ సలిపె వేశ్యాకల
కంఠుల కత్తఁటి గృహోపకంఠములందున్. 82

వ. ఆసమయంబున. 84

సీ. గణికాభుజంగసంఘటనయాతాయాత,
జామాతృభయదవాచాప్రభూత
వివిధమాయోపాయవిరచనాప్రఖ్యాత,
కర్కశోపలసదృక్కఠినచేత
నందనీపల్లవానందదత్తవిఘాత,
జనపాతశూన్యాంగజప్రపాత
యజ్ఞాతగోత్రనామాకారనిజతాత,
యుల్లాఘుశతసమాయుస్సమేత
తే. జైత్రహావ్యజ్ఞన్యసన్న్యస్తశస్త్రజాత
కలుమవీతూతిరస్కృతజ్వాలదలాత
పరుమవాచార్భటీసముత్పాద్యమాన
దీర్ఘనిర్ఘాత యద్దేవదేవిమాత. 85

తే. విత్తమీలేనివిటకోటి వెడల మీటి
విరహపరితాపములు తేచి వెతల నేచి
మదనధాటి యనంగఁ బేరొందవి వెలయు
విపులమైరేయమణిక యావృద్ధగణిక. 86

తే. ఊరివేశ్యల కెల్లను వారివారి
విటులు పండుగతగవు లంపుటలు చూచి
విప్రనారాయణునివిటవృత్తిఁ దమకు
నీవి లేకున్కిఁ గని దేవదేవి కనియె. 87

క. తమ్ము వలపంట కుండఁగఁ
గ్రమ్మి విటులఁ గలయు నేర్పుఁ గఱపెడుమనకుఁ

గొమ్మరో! తామరపాకును
గుమ్మరివురువులును బరమగురువులు సుమ్మీ. 88

వ. అని విప్రనారాయణుగుఱించి. 89

క. చక్కఁదన మెంత గలిగిన
రొక్కమునకుఁ గాని వల్వరు మనందు జనుల్
రొక్కములు జోలె లాతని
చక్కఁదనం బేమి చూచి సకియ! వలచితో. 90

క. నవమదను నైన మెచ్చవు
తవిలితి వీయజవబోడితలకు వలచితో
ధవళాక్షి! వీనివ్రేలుం
జెవులకు వలచితివో పిల్లసిగకు వలచితో. 91

ఆ. రమణి! యితఁడు "తిరువరంగం బెరయఁకోవె"
లనుచు బికిర మెత్తినపుడె జనులు
వీఁడె దేవదేవివిటుఁ డన్నఁ దల వంచు
కొనఁగ వలసె నాకుఁ గువలయాక్షి!. 92

ఆ. తొత్తుపేరఁ బెట్టి దొడ్డుకుపేరను బెట్టి
పిల్లికూనపేరఁ బెట్టి యిల్లు
వెళ్లలే దటంచు మెల్లన ముదుగులు
పాఱ విడుచుచుండుఁ బాటఁ బాట. 93

ఉ. వేసరి యే మటన్న నిలు వెల్వడఁ జాలఁడు చేత నంటిమా
దాసరిబుట్టయుఁ ముదుకథావళిదట్టియుఁ గాని కాన మో
కేసరిమధ్య! నీప్రతిన గెల్చె నిఁక న్మరిపాటి నొయ్య నీ
దాసరి నోసరింప వలదా సరివేశ్యలు నవ్వకుండఁగన్. 94

వ. అనినఁ దల్లి కాగణికామతల్లి యిట్లనియె. 95

క. పోది నప్పయు నేనును బ
న్నిద మాడినకోస మితనిఁ దెచ్చితి నిఁక నా
కొదవపని దీఱె నిఁక నీ
కొదవయె యని పల్కఁ దల్లి కూఁతున కనియెన్. 96

ఆ. తెఱవ! నేను నోరు దెఱవ కుండఁగఁ గాక
చొరవ గొనుచు నిల్లు చొర వశంబె
పఱవఁ బొమ్మటంట బరువఁటే నాకు నీ
యఱవఁ దోఁక గోసి యఱవఁ జేతు. 97

క. ఇటు చూడు నాప్రతాపము
విటులం జోఁ పిడుట నాదువిద్య మొదల నీ
వటుఁ డేమిబ్రాఁతి నాయూ
ర్భటికిఁ బూతాలు బెదరి పాఱుచు నుండున్. 98

క. వెచ్చానకు లేదనఁగా
నిచ్చటి కేతెంచి యాతఁ డిచ్చిన మేలే
వచ్చినది లాగుకొని మఱి
చొచ్చో యనిపింతు నిదియ నూ మత మనుచున్. 99

సీ. పసపుఁబిండియు సగపాలు గూర్చినపూఁత,
బొట్టుపైఁ జెంద్రంపుబొట్టు పెట్టి
క్రొత్తకమ్ములతోడి కూనలమ్మపటంబుఁ,
గటి విప్పుగా రెండుకట్లు గట్టి
మేలిమిపైఁడిపాగాలసంగతిని న,
ర్తన ఘాడు పెద్దపాదా లమర్చి

కప్పుపయ్యెద క్రిందుగా జాఱుచునుదోయి,
వారి బొజ్జకడుపుపైఁ బోరలఁ బెట్టి
తే. విప్రనారాయణోచ్చాటవిధికి దేవ
దేవి యంపినమంత్రశక్తియును బోలి
సోలుచును వచ్చె మధుమదాలోలవిహ్వృత
వివిధమాయాప్రభూత యవ్వేశ్యమాత. 100

వ. ఇట్లు వచ్చి నిలిచి విప్రనారాయణుం గనుంగొని. 101

ఉ. అల్లునియమ్మగారి కిపు డాఁకలి గాదొకొ యింటి కేమియుం
జిల్లరవెచ్చసచ్చములుఁ జీరలు నంపవు తోడి వేడ్క కాం
త్రెల్లను బండుగ న్దగవు లీయఁగఁ డాఁకి తలంప వీవు చేఁ
బెల్లుగ రొక్క మీక ధరఁ బిల్తురె వారసతు ల్విటావళిన్.

సీ. నీపట్టెతిరుమణి నీతిరుచూర్ణంబు,
గణికకు వెండిబంగారు లౌనె
నీపుట్టగోఁచియు నీకావివేష్టువ,
లావరకాంతకుఁ బట్టుచీర లౌనె
నీముష్టిగూడయు నీతులసిసరులు.
వేశ్యకుఁ బండుగువేఁట లౌనె
నీవేదశాస్త్రము ల్నీసంధ్య జపమును,
లంజెసానికిఁ బంజులగము లౌనె
తే. పెట్టనోపితివా యెప్పటట్లె యుండు
పెట్టలేకున్న విచ్చేయు పెందలకడ
మొదల రోయింతులకు నొక్కముడుపె గాక
నీసదాచార మేలయ్య! దాసరయ్య!. 102

—విప్రనారాయణుండు తనతోఁటకు దయచేయుట.—

వ. అని మఱియు ననేకప్రకారంబుల నవ్వేటునకుఁ గర్ణకఠో రంబుగాఁ బుచ్ఛదోరల నుచ్చాటనవచనంబుల భర్జించిన నతండు. 104

తే. వేశ్యమాతయు గతవయోవృద్ధ యైన
యిది సురాపాన మొనరించె నిట్టివేళఁ
గోఁతి కలు ద్రావి యుండఁ దేలుట్ట భూత
మావహించిన యట్టిస్వభావ మరయ. 105

ఉ. సిద్ధ మపాత్రురా లిది నిషిద్ధవునోటను సి గ్గొకింత లే
కుద్ధతలీలఁ జాలఁ బరుషోచ్చరణంబుల బూతు లాడెడుఁ
బుద్ధి గణింప నిల్వెడలి పోవుట కార్యము పోవ కున్న నీ
వృద్ధపిశాచికి న్వలయువి త్తము నా కది యొందుఁ గల్గెడిన్.

క. రూక లఁట! గోక లఁట! మఱి
యాకులు పోఁక లఁట! గొఱియ లఁట! యవి నాకుఁ
లేకుండుట తథ్యం బఁట!
పో కుండుట నీతి గాదు బుద్ధిఁ దలంపన్. 107

వ. అని నిశ్చయించి. 108

చ. కరమున మ్రానికుండికయుఁగంబళిమంసమునందుఁజంకపైఁ
దిరిపవుగూడయు న్గొని తదీయనివాసము నిర్గమించి యె
వ్వరు దనుఁజూతురో యనుచువంకముసుంగిడినమ్రవక్త్రుఁడై
యరిగెనతండుపంచశరునల్గులమూటకుఁదొంటితోఁటకున్.

వ. ఇట్లు చని యం దొక్కతరుమూలంబున నాసీనుం డై యతఁడు తనమనంబున. 110

చ. జనని ధనాశ నిట్లు విరసంబులు నన్నని వెళ్ళఁదోలుట
ల్వినదు సుమీ యొకింతయును పీనుల నప్పుడు దేవదేవి యు
వ్వనిత యొకింగనేనియు నవశ్యముఁ దల్లి నదల్చి నన్నుఁబి
ల్వను జెలిఁబుచ్చునో మదిఁగలంకము మానుపఁ దానె వచ్చునో.

వ. అని మఱియును. 112

క. ఆరీతిఁ బ్రేమ గల్గిన
నారీతిలకంబు రాదె నావెంటనె తే
దారీతి యింక శంబర
వైరీతిఁ దరించునట్టివల నెయ్యదియో. 113

తే. సతికిఁ బతికి సమానమై జరగ దేని
నిరయమున లేదు వలపంత నిగ్రహంబు
సతికిఁ బతికి సమానమై జరగెనేని
స్వర్గమున లేదు వలపంత సౌఖ్య మెన్న. 114

చ. తలఁచిన నిద్ర రాదు చలిదాల్కొను మోసలఁ బేరనవ్వనిం
బిలిచిన గుండె జల్లుమనుఁ బేర్చు మనఃపరితాపవేదన
ల్నిలిచినచోట నిల్వ ధృతి నెక్కొన దక్కట! రంగరంగ! తా
వలచినయింతిఁ బాయువగ వద్దు సుమీ పగవానికేనియున్.

ఉ. నున్నని బాహుమూలములు నూత్నసుధారస మొల్కు
పల్కులుం, దిన్నని మేనుదీవయు మదించిన సిబ్బెపు గబ్బి
గుబ్బలు, స్గన్నుల నవ్వు నెమ్మొగముఁ గన్నులఁగట్టినయట్లు
నాకు నౌ, చున్నది నామతిభ్రమణమో మరుమాయయొ
కొమ్మనైజమో. 116

తే. లాలనముఁ జేసి మన్మథకేళి నేఁడు
కుసుమకోమలి యెవ్వానిఁ గూడునొక్కొ

యతఁడు దొలుజన్మమునను శ్రీహరిని బైఁడి
పుష్పములఁ బూజ చేసినపుణ్యతముఁడు. 117

తే. అతివ వైష్ణవమతరహస్యమునఁ జాలఁ
బరిచయముఁ గన్నయట్టిప్రపన్నురాలు
శూద్రసంపర్కమున కేల చొచ్చు మరల
నిచ్చటికి నెంతప్రౌఢైన వచ్చుఁగాక. 118

మ. లతి నూఱ్లేఁబదు లెప్పుడు న్ధనము చేతం గల్గి వర్తించుపు
ణ్యాతపశ్శాలికిఁ గాక నిర్ధనునకు న్నా కేల సిద్ధించు నా
సతిసంపర్క మవక్రవిక్రమవిరాజ ద్రాజదోర్దండమం
డితసామ్రాజ్యవధూటి చేరఁజను నేసిర్భాగ్యదామోదరున్.

క. ధనమూలము జగమంతయు
ధనవంతునిఁ గాని వేశ్యతల్లి దరిద్రుఁ
దనకూఁతుఁ జేర నీయదు
ధన మేడది దాని కొసఁగఁ దథ్యం బైనన్. 120

సీ. ముసిఁడిమ్రాఁకునకైన తమును బండ్లు గల్పించి,
చెఱకున కేల సృజింపఁడాయె
బూతిగడ్డకు సైతమును గంధ మొనరించి,
కుందనంబున కేల కూర్పఁడాయెఁ
బొలము తాళ్ళకు సైతమును బువ్వుఁ గల్పించి,
శ్రీగంధమున కేల చేర్పఁడాయెఁ
బుట్టక్రొవ్వుల సైతమును దేనె గలిగించి,
గేదంగి కేల గల్గింపఁడాయె

తే. ధర నిరక్షరకుక్షుల ధనులఁ జేసి
విద్య గలవారి నేల దరిద్రులఁ జేసె

బ్రహ్మాసన నేటి కతని నేర్పరిగ నెంచి
పుడమి వర్ణించుకవులఁ జెప్పెడిది గాక. 121

ఆ. తమకు నేమి త్రవ్వి తల కెత్తి రమరు లీ
యుర్విమనుజు లేమి యొసఁగ రైరి
నింగి వారసతుల నిర్మాతృకలఁ జేసి
పుడమి మాతృభూతముల సృజించె. 122

క. నల్లి గలశయ్య నిద్రయుఁ
జిల్లి గలఘటంబునందుఁ జేర్చిననీరున్
దల్లి గలవేశ్యఁ దగిలిన
వల్లవుసుఖములును బోధివల్లవసుఖముల్. 123

క. లతకూనలు జవ్వనమున
వితతంబుగ వార్ధకము ప్రవేశం బైనన్
శతకంచుకంబు లూడ్చిన
కృతకఫణుల్ వారసతులు కేవల మరయన్. 124

సీ. ధనముకొప్పెరదండఁ బెనుభూత మున్నట్లు,
గంగదరి మొసలి గాచినట్లు
రసకూపమున నంటి రాకట్టు గలయట్లు,
మొగిలిపువ్వున ముండ్లు మొలచినట్లు
అమృతకుంభము నగ్ని యావరించినయట్లు,
శ్రీగంధమునఁ బాము చేరినట్లు
తేనె తెట్టెకుఁ జుట్టు రా నీఁగ లున్నట్లు,
పట్టెకంకటి నల్లి పట్టినట్లు
తే. అవని వేశ్యలపేరిశ్రేయస్సులకును
దల్లు లనియెడివిఘ్నాధిదైవతముల

విధి విచారము లేక యివ్విధి సృజించె
వేశ్య రతిసౌఖ్య మెఱుఁగునే వేదజడుఁడు. 125

క. లోలత విటుఁడైనం దా
నేలా తల్లుల సృజించు నిటు వేశ్యలకుం
గీ లెఱుఁగక చెఱిచెను విధి
కూళయి గొడ్రాలు బిడ్డకు ట్టె మెఱుఁగున్. 126

తే. బ్రహ్మచర్యంబునకు నంతరాయ మొదవె
జలజముఖమైత్రియును గొనసాగ దయ్యె
వసుధఁ బరికింప నిది సుమీ "వ్రతము చెడ్డ
సుఖము దక్క" దటన్నవచోనిరూఢి 127

తే. ప్రాగ్భవంబునఁ జేసినపాతకంబు
నతనుసంతాప మనుపేర ననుభవింపఁ
జేయుచున్నాఁడు శ్రీరంగశాయి వగవ
నేల కర్మక్షయం బొట మేలు గాదె 128

ఆ. శతభిషగ్వరుండు సకలౌషధీనాథుఁ
డమృతధాముఁ డిందిరానుజన్ముఁ
డట్టిరాజు రాజయక్ష్మచేఁ గృశియించుఁ
గర్మ మనుభవమునఁ గాక తెగునె?. 129

మ. నిల దీయంగము రంగనాథ! వర మే ని న్వేఁడెద న్నన్మహీ
సలిలాగ్నిశ్వసనాభ్రతత్త్వముల నాచంద్రాస్య నెమ్మేనఁ దో
య్యలిఘుర్ణాంబుల నింతినేత్రములఁ గీరాలాప ప్రాణంబులన్
జలజాతేక్షణ మేనిలోనిబయలన్ సాయుజ్య మొందింపవే.

—విప్రనారాయణుఁడు రంగనాథుని స్మరించుట.—

వ. అని ప్రార్థించి యాపద్ధరణంబునకు హరిచరణస్మరణంబ
శరణం బని నిటలతటఘటితాంజలి యై యి ట్లనియె. 131

ఆ. రంగ! రంగనాథ! రంగేశ! రంగేంద్ర!
రంగశాయి! యోపురాణపురుష!
నీకృపావిభూతి నీబంటుబంటుల
పాదధూళి మీఁదఁ బఱఁగఁ జేయు. 132

సీ. అక్షీణకరుణాకటాక్షవీక్షణరమా,
రక్షితాపాంగసారంగవిభుని
బర్హిర్ముఖావరపక్ష్యతోహరగరు,
ద్రథసార్వభౌమతురంగవిభుని
శయనీభవత్సహస్రఫణామణిప్రభా,
రాజిరాజత్తనూరంగవిభుని
బహుముఖబ్రహ్మాండభాండకాండాంతశ్చ,
రాచరావలిబాహ్యారంగవిభుని

తే. మానసమ్మునఁ దలఁచెద మన్మథప్ర
హారసంతాపితాభీరచారుభీరు
బృందసహకేళిధామకళిందజాత
రంగరంగద్విభుం డైన రంగవిభుని. 133

వ. అని వేఁడిన. 134

సీ. శరణాగతావనస్ఫురణాసముల్లస,
త్కరుణాకటాక్షకింకరశుభుండు
కమలాకుచద్వయీవిపులానులేపకుం,
కుమలాలితాంకవక్షోవిభుండు

ప్రపదానిశానతత్రిపదాననాధిప,
ద్విపదానవాహితాధికవిభుండు
శతకోటిరవివిభాతతికోటిహసితక్షి,
తికోటిమానవాధికప్రభుండు
తే. శక్తిహీనత వేశ్యానురక్తిం బొరలు
భక్తుపరతాప ముడుప నుద్యుక్తుం డగుచు
రంగదాత్మాంఘ్రినక్తకీరంగదంత
రంగవాంఛాప్రదాయి శ్రీరంగశాయి. 135

సీ. వెడదనెన్నుదుటిపై వెదురాకువెళుపుతో,
దిద్ది తీర్చినపట్టెతిరుమణియును
నామంపుంబట్టెలనడుమ శుద్ధసువర్ణ,
వర్ణమై తనరుశ్రీచూర్ణరేఖ
కంబుకంఠమునం బంకరుహాక్షమణులతో,
భాసిల్లెడు తులసిపూసపేర్లు
మెఱుంగారుపొక్కిలిమెలవుతోం దాల్చిన,
సంవ్యాన మగునొంటిజన్నిదంబు
తే. గొత్తపెన్నూలిమాంజిం గీల్కొలిపినట్టి
పసవుం గావీనమును బచ్చపట్టుతిడువు
నమరం జిన్నారిచిఱుతప్రాయమున మున్ను
జగతిం బలి వేండినట్టి వేషము ధరించి. 136

క. సారమణిఖచిత మగుబం
గారవుందనగిన్నె వారకామిని కొసంగన్
శ్రీరంగదివ్యధామవి
హారుండు స్వామి మర్ధచోరుండై కొనిపోయెన్. 137

శా. కల్యాణైకనిధాన! దానవజనఘ్నత్రాసవత్కర్మతా
శ్చర్యశ్రీంద్రవితాన! తానవయుత! శ్రీపద్రజఃపోషితా
హల్యాశాపనదీన! దీనజనరక్షాశాహరోద్భూత కా
సల్యాగర్భనిధాన! దానవహరా! శౌర్యాన్వయగ్రామణీ!.138

క. బర్హితురంగమజనకస
మర్హధనుర్దళన! యాభియాత్రావేళా
నిర్హేతుకగౌతమముని
గార్హస్థ్యపాదపాదకమలవినోదా!. 139

మాలినీవృత్తము. ఉదితసుఖతరంగా! యుద్ధధీరాంతరంగా!
సదవిమలితగంగా! భవ్యతేజోయుగంగా!
విదితకపితురంగా! విద్ధమాయాకురంగా!
ప్రదరనిధినిషంగా! భర్తభావానుషంగా!. 140

గద్యము. ఇది శ్రీమదాపస్తంబసూత్ర భారద్వాజగోత్రపవిత్ర శ్రీరామచంద్రకరుణాతరంగితవైభవ సారంగునృసింహమంత్రితనూభవ పరిచితభగవద్భాగవతకైంకర్యవిధాన తమ్మయాభిధానప్రణీతంబైన వైజయంతీవిలాసంబునందుఁ దృతీయాశ్వాసము.

శ్రీ ర స్తు.

# వైజయంతీవిలాసము

## చతుర్థాశ్వాసము

---

క. శ్రీత్రిభువనజీవస్తుతి
పాత్రావయవప్రసన్న! భావవిరాజ
ద్గాత్రపరిచారకాధిక
చిత్రితమునిచిత్తధామ! శ్రీరఘురామా!. 1

వ. అవధరింపు మట్లు దేవదేవివిగృహంబుఁ బ్రవేశించిన నతనిం
గనుంగొని యవ్వేశ్యమాత యి ట్లనియె. 2

ఆ. ఎందునుండి వచ్చి తెవ్వరాయనవు పే
రెద్ది యిటకు రాఁ బనేమి యనిన
వేశ్యమాత కనియె విజనకాలాశ్రయీ
కృతవటుండు శాంబరీవటుండు. 3

ఉ. ఓయలివేణి! యిప్పురి నెయుండుదు నన్యుఁడఁగాను విప్రనా
రాయణుకూర్మిశిష్యుఁడను రంగఁడటందురు పేరుమీకు నేఁ
డాయన పంపినాఁ డొకయనర్ఘ్యసువస్తువుకొమ్మ! యందుకొ
మ్మా యని గిన్నె నిచ్చె వెడమాయలవెల్లికి లంజెతల్లికిన్. 4

చ. సతతము బ్రహ్మశర్వసురసంయమిముఖ్యుల నాత్మమాయ మో
హితులుగఁ జేయుసామి వెలయింతిని మోహితఁ జేయ లేక ప్రా

కృతజనునట్ల తాను దనగిన్నె నొసంగెను బంటుకోసమై
మతకరి వేశ్యమాత వెడమాయల జేయలు విష్ణుమాయకున్.

వ. ఇట్లు గిన్నె నొసంగినఁ గైకొని ప్రమోదమానమానసయై యతని నంతర్గృహంబునకుఁ దోడ్కొని చని నూత్నరత్న కంబళాస్తరణంబున సుఖాసీనుం గావించి. 6

తే. జాలవల్లికతోడ బాగాలుఁ దెల్ల
నాకులును గైరవళ్ళ గంధాక్షతములుఁ
గప్పురముఁ బైఁడిచెఱఁగులదుప్పటియును
నెదుటఁ బెట్టిన నవ్వటుఁ డిట్టు లనియె. 7

క. ఓకామిని! విడె మేటికి
మాకు సదా వటువులకును మహి నిది మీరు
న్నా కొసఁగ రాదు మేముం
గైకొనఁగా రాద టనినఁ గామిని పలికెన్. 8

క. మీ రొల్లకున్న మీయయ
గారికి నిం డనిన నతఁడు గణికాంబికతో
వారికి నిచ్చుట మా కప
చారము వారలును బ్రహ్మచారులు గారే. 9

వ. అనిన వేశ్యాంబ వటునకి ట్లనియె. 10

క. ఆయన బ్రహ్మాచారె
ట్లాయెను మాయింటిరాయఁడై వీడియమును
జేయునె యనవుడు నతనికి
మీయింటనె యిదియు నిందు మెచ్చది మాకున్. 11

ఉ. మత్తిత పోలెమాపడుచు మార్గ్మసలన్ జలికింపఁ బూని నీ
వెత్తితనాలు మాన వని వేడ్క నిటాడఁగ నింటనుండి దాఁ

జిఱ్ఱునఁగోపగించుకొని చెప్పఁడు చేయఁడు లేచిపోయె మీ
వెఱ్ఱియగారు మంచిగుఱువే దొరికెం జదు వెట్లు చెప్పునో.

చ. అలుకలు చాలు రమ్మనవయా యయగారిఁ దమమ్మ కింత బు
ల్పులకుఁబనేమి తాఁదొలఁగిపోయినయప్పటినుండిపిల్లయుం
బలుకదు మమ్ముఁ గూడి పెనుపండుగ చేయదిదేటికింటిలోఁ
గలఁతలటంచుఁబల్కెననఁగై తవమాణవకుండు దానితోన్.

క. నే రమ్మనిన న్వచ్చునె
మీరలె పిలువఁ దగుఁ గాక మీయల్లునిఁ దో
తేరఁ దగువారిఁ బంపుఁడు
మీ రెఱుఁగనితగవు గలదె మేదినియందున్. 14

క. నావుడు నవ్వేశ్యాంబిక
యావటునిం జూచి పిలువ నంపఁగ లే మ
య్యా! వింత కాఁడు తా నెటఁ
బోవునొ తా వెఱుఁగ మెటకుఁ బోదు మటన్నన్. 15

ఉ. ఏయెడ కేల పోవు నతఁ డెవ్వరికై నను జిక్కువాఁడె తా
నాయన మీకు నీవలకు వచ్చినయప్పటు దిద్ది తా సుఖో
పాయతనున్నవాఁడు శ్రుతిపాఠము సేయుచుఁ దోఁటలోన నే
మాయయగారటంచు నలమాయలమారి చనెందటాలునన్.

క. దయ యెటువంటిదొ రంగే
శయునునకును దాసుపై నిజశ్రీపాద
ద్వయిఁ దద్వేశ్యాగారము
గయకంటెఁ బవిత్రితంబు గా నొనరించెన్. 17

తే. అటుల వటుఁ డేగ నంత నక్కుటిలమతులు
పసిఁడిగిన్నియఁ జూచి యప్పాఱు కేడ
దిక్కు వస్తువు మనలఁ గన్గట్టునట్టి
కీర్తివలె నున్నయది దీనిరీతి యనుచు. 18

క. చెన్నారుపసిఁడిగిన్నియఁ
గన్నారం గనియు నమ్మక పరీక్షార్థం
బన్నారీమణు లపు డది
సొన్నారిం బిలిచి తెచ్చి చూపించుటయున్. 19

తే. అతఁడు నది చూచి దానిపై వితత మైన
శంఖచక్రాంకములవిలాసంబువలన
దేవధన మౌటఁ దెలిసియుఁ దెలియనట్లు
గిన్నె మే లైన దిది పదార్వన్నెపసిఁడి. 20

క. మీ వెలఁది కూడఁ బెట్టిన
రో వెలఁ జేయించుకొంటిరో మీ కెవరో
రో వాటున నిడిరో విటుల్
తా వెట్టిదో యనిన వేశ్యతల్లి యతనితోన్. 21

సీ. మా దేవదేవి సహోదరియును దాను,
నిఖిలేశుఁ డగుచోళనృపతిఁ గాంచి
యతనికి గీతాదికతు లెల్ల వినిపించు,
నవ్వేళ నోడబేహారి యొకఁడు
నృపతికి గిన్నెఁ గానికఁ జేసి పొడగన్న,
సంగీతవిద్యాప్రసంగవేళ

వచ్చిన దగుట నవ్వాసుమతీనాధుండు,
సుచితజ్ఞుఁ డై మాకు నొసఁగె ననిన
తే. దాని కపటోక్తులకు నట్ల తప్ప దనుచు
వాఁడు మెయికొని యేదాత యీఁడు మీకుఁ
గోరినపదార్థ మని తాను వారిఁ బొగడె
బాహిరంబున నాపశ్యతోహరుండు. 22

వ. తదనంతరంబ. 23

క. వీడెము గంధము నిడి యా
నాడింధము ననిచి తజ్జనని సుతతో నో
చేడియ! యిన్నా ళ్లెఱుఁగము
బోడెఁడు! బంగారుపెట్టెపో! పరికింపన్. 24

తే. ఇంత బంగారుగిన్నియ సంతరించు
వాఁడు దీనికి జోడై నపైఁడిపళ్లె
రంబు చిటిపొటిగిన్నెలు చెంబు సంత
రించకుండునొకో యమ్మ! యెంచుకొమ్మ. 25

తే. మండగుడివేరినగరాన నుండు నితని
తంత్రి లక్షాధికారి యాతఁడు గడించి
నట్టిసొమ్ములు గాఁబోలు నిట్టి వెన్ని
గలవొ యన్నియు నొయ్యన వలయుఁ గొనఁగ. 26

వ. అని యతని మగుడఁ బిలువఁ దలఁచి. 27

—విప్రనారాయణుని దెమ్మని వేశ్యమాత కావేరిం బంపుట.—

క. శ్రీరంగిఁ బంపుదమొ మన
గౌరిం బంపుదమొ యంబికం బుత్తమొ కా

వేఱిం బంపుదమో యె
ల్లారిం బంపుదమొ యని తలఁచి వారలలోన్. 28

క. ఆరయ సమయోచితవా
చారచనప్రౌఢి మిగుల సడిసన్నది కా
వేరియ కుంచెనవనిఁ గడి
దేఱినయది పంప వలయు దీనినె యనుచున్. 29

సీ. గమకించుచమరివాలము లోనఁ గీలించి,
యుష్ణీషంబుగ నోరకొప్పు దిద్ది
నాభినామంబు నెన్నడుమఁ గస్తురిరేఖ,
మోసుగాఁ బాపట మోయఁ దీర్చి
తాటంకవలయమధ్యమునఁ జెందొవపువ్వు
లవతంసకముగాను హత్తుకొల్పి
మడుఁగుఁజెంగావిపావడమీఁద వెలిపట్టు,
చీరకుచ్చెలు నేల జీఱఁ గట్టి
తే. మెఱుఁగుఁదీఁగెయుఁ బెద్దముక్కఱయుఁ బెట్టి
వండతాయెతులును సందిదండ లునిచి
కేల గాజులు గాడసరాలు దొడిగి
ప్రేమఁ జైసేసి యద్దాసిఁ బంపు చేసి. 30

వ. అప్పు డమ్ముదుసలి యి ట్లనియె. 31

తే. ఏ నవుడు కోపగించుకొం చిల్లు వెడలి
పొ మ్మనిన నట్లు దాసరిబోడి పోయి
తోఁటలో నున్నవాఁ డటఁ బోడి నీవు
సమ్మతిలఁ బిల్వ యతనిఁ దో డ్తె మ్మటన్న. 32

క. అమ్మాటకు నది యిట్లను
సమ్మతి కా కేమి పిలువ సమ్మతి గాదా
రమ్మని యంటేఁ జాలును
బమ్మేఁడు నా వెంటఁ బెద్దపరుగున వచ్చున్. 33

క. వలవు గలయుంటుగానికిఁ
బిలుపే దేవేంద్రపదవి ప్రియురాలు దను
న్బిలిచె ననువార్త విన్నను
నిలిచినచో నిలువ నేర్చునే నిముసంబున్. 34

వ. అది యెంతపని యిప్పుడే తోడితెత్తు నని చని యవ్విప్ర
నారాయణుం గనుంగొని యి ట్లనియె. 35

తే. డొంగవలె వచ్చి యిచ్చట డొంగినా వ
దేమయా! బావగారు! పెద్దామె కోప
గించినందులకా బళా మంచివాఁడ
వేమ నందును ముసలాపె యేవి వేకి. 36

ఆ. అప్పు డిల్లు వెడలి యటు వీథికై నీవు
పోవ దేవదేవి పొగిలి మిగులఁ
దల్లిఁ గోపగించి మళ్లఁ బిల్వ మటంచు
నంపె నన్ను నీవు నంతలోన. 37

ఉ. ఎక్కడఁ బోయితో యెఱుఁగ కేనును వెంటనె వచ్చియప్పుడే
దిక్కన నిన్నుఁ గానక మది న్వెఱ గందుచు దేవుఁడాన నీ
బిక్కిర మెత్తు నయ్యెఱవపిల్లలవాడల నింత సేవు నీ
యిక్కవ లన్నియు న్వెదకి యే నిట వచ్చితి లేచి రావయా!.

వ. అనిన నతం డి ట్లనియె. 39

క. రమ్మనెనా మఱి యే మనెఁ
బొమ్మట నీయక్క నీకుఁ బెరుమాళ్ళానే
యమ్మ నదల్చెనె యాబిడ
సమ్మతినే వచ్చినావా సకియరో! చెప్పుమా. 40

క. మీయక్క పిలువు మనెనో
మీయమ్మయుఁ బిలువు మనెనో మృష లాడితివా
మీయక్క తోడు నీకున్
మీయప్పకుఁ దప్పుదువు సుమీ కావేరీ!. 41

క. అని మఱియు మఱియు నట్లడి
గినమాటలె యడుగుఁ బ్రియసఖివార్తల నూ
తనతం బునరుక్తముగా
విను నది కాముకులమదికి వేడుక గాదే. 42

—విప్రనారాయణుఁడు మరల వేశ్యయింటికిం జనుట—

క. మధురములు సతులవలపులు
మధురంబులు సతులముద్దుమాటలు మిగులన్
మధురము తా వలచినసతి
మధురములు తదీయదూతిమాటలు మఱియున్. 43

వ. ఇవ్విధంబున శపథపూర్వకంబుగాఁ దన్ను నడిగిన నవ్విడు
గునకు వినయసంభ్రమంబున గంభీరవాగ్విజృంభణంబు
గా నాశంభళి యి ట్లనియె. 44

క. మాయక్క పిలువు మనియెను
మాయమ్మయుఁ బిలువు మనెను మాయాశియతోడ్దే

మాయంబికమ్మయానే
వే యిఁకఁ బదవయ్య! యేల వేదనఁ బొరలన్. 45

వ. నావుడు నతండు తనమనంబున. 46

క. రమ్మనక పోదు తాత్ప
ర్య మ్మధికము దేవదేవి కది సహజంబే
యమ్ముసలిబేరజ మ్మది
రమ్మనె నను మాట నమ్మరా దెప్పటికిన్. 47

ఆ. ముసలిదానిమాట వెస నమ్మి పోరాదు
పోవ కుండ రాదు దేవదేవి
రమ్మనంగ దీని కెమ్మెయి నుండుఁ గా
ర్య మ్మటంచు సంశయమ్ము నొంది. 48

తే. దైవయత్నము లేక చెందవు శుభాశు
భములు దైవంబుఁ బరిమారింపంగ రాదు
కానఁ బ్రారబ్ధకర్మంబు దీని కేమి
కొంచ కైనట్టు గాని మ్మటంచుఁ జనియె. 49

వ. ఇట్లు చనుదెంచినయతనిం గనుంగొని దేవదేవి యిట్లనియె.

ఉ ఆయె మఱేమి మంచిగురు వౌనయగారవె యట్లు పోదురా
మాయలవానికి న్వలపుమాయమటన్నది నిక్క మయ్యెము
న్నాయమ యేమటన్న నగవై వినుచుందురుగాని పాటిగాఁ
జేయరు శాంతి దాల్చి గుణశీలురు మీ రలుగంగఁ జెల్లునే.

క. నాపేరఁ బెట్టి నిన్నును
నీపేరం బెట్టి నన్ను నిస్తారములు వా

శాపథము లాడిన నే
లోపలిలాహిరిజనంబులోఁ జరియింతుఁగా. 52

కం. మొదలె సివవెఱ్ఱి యటుపయి
ముది మది వెసఁ దప్పి కోపమున నాడిన నీ
వది యెఱుక చేసికొని యలు
గుదువా నేఁ గాక యామె గుఱుతా నీకున్. 53

వ. అని యిట్లు దేవదేవి యారడించినఁ దదీయాంబ చను
దెంచి యి ట్లనియె. 54

ఆ. నవ్వు చేసికొంద్రు నామాట కలుగదు
వృద్ధటంచుఁ బెద్దపెద్ద వారలు
దేవరట్ల మీరు శ్రీవైష్ణవులు మాయ
పక్షమాట లెగ్గు పట్టఁ దగునె?. 55

వ. అని యివ్విధంబున నవ్వృద్ధపిశాచి యతిశాంతురాలై
సాంత్వనవచనంబులు పలుకం గనుంగొని యతం డంతరం
గంబున నది యంతయు దేవదేవికిఁ దనయం దనురక్తి గలు
గుట నెఱింగి పుత్రిక నతిక్రమింపలేక ప్రియోక్తు లాడు
టగా భావించుకొనియె నదియునుం గాక. 56

కం. కేవలపైత్యభ్రాంతుఁడు
భూవలయము దిరుగు నన్న పోలిక వసుఁ డై
తా వలచినట్టివానికి
స్త్రీ వలచినయట్లు లుండుఁ జిత్తములోనన్. 57

వ. అనంతరంబ.
58

తే. విటశిఖామణి యైనయవ్విటుశిఖామ
ణికిని సంపెఁగనూనియ నెలఁత శిరసు
నంటెఁ గేల్దోయి తాళంబు లతిశయిల్ల
బోడితలమీఁదఁ దాండవం బాడుచుండ. 59

తే. అవ్విధంబున శిర సంటి యంగమర్ద
నంబుఁగావించి మాషచూర్ణంబుఁ బ్రామి
మజ్జనం బార్చి చెంగావిమడుఁగు లిచ్చి
నామములు పెట్టుకోనఁ జేసి ప్రేమ నతని. 60

తే. గంధకర్పూరకస్తూరికావిలేప
నాదుల నలంకృతునిఁ జేసి యవలఁ దాను
శిరసు మజ్జన మాడి నల్వురుస వన్నెఁ
దీర్చుకొని తన్మనోవాంఛఁ దీర్చె నంత. 61

—బంగరుగిన్నె లే దనియర్చకులు జియ్యరుతో విన్నవించుట.—

మ. అట రంగేశ్వరునర్చకు ల్నియుత మానద్దేవుమధ్యాహ్నమ
ప్పటినై వేద్యమువేళ దేవళములో బంగారపుంగిన్నె నె
ప్పటిచోఁ గానక చంచలాత్ములయి లోఁ బల్మందసం బా
దిగాఁ, దటసంస్థానము లెల్లఁ జూచి యటుపైఁ దత్పాత్ర
లేకుండినన్. 62

తే. వారలును దేవళపుటధికారి యైన
జియ్యగారికి విన్నవించిన నతండు
నదరిపడి లేచి మఱియును వెదకవలయు
ప ట్లరసి యెందుఁ గానక పరితపించి. 63

క. గిన్నె యిటు మున్ను దేవర
సన్నిధి నేఁ గంటి వింతజను లీలోనే
కన్నవుదొంగలు వచ్చిరె
మిన్నక యీలోనివారె మ్రింగి రటంచున్. 64

క. బడిపనులవారి గొల్లల
గుడినంబుల జంగవరుసఁ గొని చేకోలఁదిఁ
బడిమాఱుఁ ద్రిదండంబుఁ
నెడమఁ గుడి న్నారసింహ మెత్తినరీతిన్. 65

తే. ఇట్లు కోలాహలంబుగాఁ బెట్లఁ బెట్టి
వీఁక నందఱ నచట నొయ్యొఁక చేసి
ముమ్మర మ్మైనయారివేరమ్ము నదికిఁ
బుట్టి యతఁ డేగెఁ దలవరికొట్టమునకు. 66

సీ. కొనముక్కుపై నుండి కనుబొమ్మలకు వెళ్ళ,
నాభినామంబు సన్నముగఁ దీర్చి
చెవిచెంత కొరగ వేసిన కోరసిగసందు,
తెల్లచెంగులబట్ట వెళ్ళఁ గట్టి
యనుకు వేళ్ళను గంధమును నాభినుండి మూఁ,
పులదాఁక బంగారుపూఁతఁ బూసి
చెఱఁగుదిక్కునఁ దోఁక చెఱఁగు దూలఁగ నీలి,
కాసెచే హనుమంతుకాసె వేసి

తే. తోడవుఁగత్తులు గుదెలును గడల నొంటి
పోఁకపిడెము లమర మైతే కరముల

నొంటరులు గొల్వఁ దలవరి మంటపమున
నధివసించిన దండనాయకునిఁ గాంచి. 67

వ. తీర్థప్రసాదంబు. లిచ్చిన నతండు ప్రత్యుత్థానంబు చేసి యందుకొని వేంచేసినప్రయోజనం బేమి యని యడిగిన నతం డిట్లనియె. 68

తే. అవసరము లెల్ల ముగియ ననంతరమున
రాత్రి పవళించువేళ శ్రీరంగశాయి
యానవా లాదగించుపదాఱువన్నె
బంగరపుగిన్నె పోయెను బట్టపగలు. 69

క. ఆసన్నత స్వామికి నిజ
దాసుఁడ వై నట్టినీవు తలవరిపని యా
జ్ఞాసిద్ధిఁ జేయఁ గోవెల
లో సొమ్మటు లైన నిన్ను లోకులు నగరే. 70

ఉ. పో నెడలేదు గిన్నెఁ గొనిపోయినముచ్చులు నూరువెళ్ళకి
లోనె యడంగి యుండ్రు పురిలో వెదకింపుము చీఁకటిం బర
స్థానము సేయ కుండ నిఁక సన్నిధి మా కపరాహ్ణకాలసే
వానియమం బటన్నఁదగువారలఁబంపియతండుచయ్యనన్.

తే. ఊరఁ గల్గినయగసాలివారి నెల్ల
నింటియొద్దకు నొండొరు నెఱుఁగ కుండ
రేయిఁ బిలిపించి శ్రీరంగశాయిగిన్నెఁ
దస్కరుఁడు దీసినట్టివిధంబుఁ జెప్పి. 72

క. కంచును రాగియు వెండియుఁ
గాంచనమును హీరా క్తికాదికము లగుమణులుం

బంచాణమువారిండ్లకుఁ
గొంచక కొనివత్తు రమ్ముకొనుటకుఁ జోరుల్. 73

క. అట్టియది మాకు నెవ్వఁడు
నెట్టన నెఱిఁగించు నాతనికి నిచ్చెద నేఁ
గట్టినయాదుప్పటి నే
నెట్టియెడం బ్రచుర మతని నెన్నఁడుఁ జేయన్. 74

వ. ఇట్లు పట్టణంబునం గలలోహకారకుల కెల్లఁ బ్రత్యేకం
బుగా రహస్యంబునం జెప్ప నట్టియెడ. 75

తే. అందు వేశ్యాగృహంబున హైమపాత్రఁ
గన్నయగసాలిబత్తుఁ డాగిన్నె సుద్ది
నేకతంబునఁ దలవరి కెఱుక చేసి
చనియె ఘన మైనమెచ్చుఁ గైకొని ముదమున. 76

వ. వానికిఁ బ్రమోదమానమానసుం డై తలవరియు నమ్మ
ఱునాఁ డరుణోదయంబున. 77

సీ. చలదయఃపత్త్రికోజ్జ్వలదండకాండముల్,
ఘలుఘల్లు మనుచు ముంగలఁ జెలంగ
నునుపారఁ జికిలి చేసినవిచ్చుకత్తులు,
తపనదీప్తులఁ దళ త్తళ యనంగ
హనుమదాకృతులు వ్రాసినకంచుటరిగలు,
జాళించురవళిచే డాలు మించ
నదరుఁ గ్రొవ్వులమ్రోఁత కదరి నల్దిక్కుల,
నార్తరావముల వాయసము లడఁగ

ముందటను గంచుకొమ్ము మిన్నంది మొరయ
జారచోరులగుండియల్ ఝల్లనంగ
వెడసి కోలాహలంబుగా వేళవాటిఁ
జేరి యప్పట్టణముతలవారి గాంచె. 78

అందు. 79

ఎఱమట్టిపూఁతచే మెఱుఁ గారుగోడలఁ,
  బై క్రింద సున్నపుఁబట్టియలును
ద్వారబంధమున సిందూరంపుబొట్లును,
  గడపపైఁ బసవు నక్షతలచాలు
భిత్తిభాగమునఁ గ్రొన్నెత్తురుజిట్టలు,
  చూరుల మాంసంపుఁదోరణములు
తినెపై నంబికాదేవిపాత్రంబులఁ,
  బూజచేసినమద్యపూర్ణఘటము
గలిగి ఘనసారకస్తూరికాసుగంధి
గంధపుష్పాక్షతార్చనబంధురాభి
నవకలశభాసి గృహదేవభవనసూచి
తేందిరం బైనయావేశ్యమందిరంబు. 80

—— దేవదేవియింట బంగారుగిన్నె దొరకుట. ——

కని తదీయబహిర్ద్వారప్రదేశంబునఁ దాను నిలిచి పరివార జననివహంబునం దద్గృహంబు శోధింపం దగువారిఁ బని చినం జని వారును. 81

అందులఁ దగినగృహంబుల
కందువ లన్నియును వెదకఁగా నొకచోటం

జందనపుమందసంబునఁ
గుందనపుంగిన్నె గాంచి కొని చని దానిన్. 82

క. తలవరి యెదుటం బెట్టిన
నలవేశ్యఁ దదీయమాత నగ్గిన్నియ జి
య్యలకడకుం గొని చనఁగా
లలనామణితల్లి వారలకు ని ట్లనియెన్. 83

క. ఇటు లేము నెఱుఁగ మేమియు
విటుఁ డొక్కఁడు గిన్నె మాకు వేడుకతోఁ దా
నిటఁ దెచ్చి యిచ్చి యింటను
విటుఁడై యున్నాఁడు దగ వివేకించవయా!. 84

వ. అన విని యత్తలవరి యతనిం దోడి తెం డని నిజభృత్యులం బనిచినం జని వారలు తదీయశయనాగారంబున నున్న యవ్విప్రనారాయణుం గనుంగొని. 85

క. దండము దండ మి దెవ్వరు
తొండరడిప్పుడులు గిన్నె దొంగై నారో
రం డిట వేంచేయుం డిదె
దండ మిడఁగ వచ్చినాఁడు తలవరి మీకున్. 86

-తలవరి విప్రనారాయణుని గిన్నెతో జియ్యరుకొప్పగించుట.-

క. అని బహువిధముల సొల్లుం
దనముల నాడుచును దొంగనాసామీ! గొ
బ్బున వేంచేయుం డనుచును
జని యతనిం జియ్యగారిసమ్ముఖమునకున్. 87

వ. తోడ్కొని చని యత్తలవరి వారల నక్కనకపాత్రంబుతో
జియ్యల కొప్పించిన నతండు వేశ్యం గనుంగొని యగ్గిన్నియ
మీకు నేక్రియం జేరె నెఱింగింపు మనిన నవ్విప్రనా
రాయణుం జూపి యది యిట్లనియె. 88

సీ. ఈదాసరయ్య తా నేఁడాదినుండి మా,
దేవదేవికి విటుఁడై వసించుఁ
దోఁటలో భిక్ష మెత్తుచు బసాపడుచున్న,
వాని నింటికిఁ దెచ్చి వలపుచేత
నెదురు పెట్టును గాని యెఱుఁగ మీతనివంకఁ,
జడెడుబియ్యము స్వయంపాకమునకు
నెన్నఁడు విడె మైన నియ్య వటంచును,
నేనునుఁ గోపించి యిల్లు వెడలి
తే. పొ మ్మనినఁ బోయి యొకచిన్నబమ్మచారి
చేత గిన్నియఁ బుత్తెంచె నాతఁ డితని
శిష్యుఁ డనియెఁ బరామరిసించుఁ డనిన
విప్రనారాయణుఁడు సభావితతి కనియె. 89

క. నా కెక్కడిశిష్యుఁడు నే
నేకాకిని లెస్స తెలియుఁ డిది నిజ మైనన్
శ్రీకాంతుని గిన్నియ నే
నీకాంతకుఁ దెచ్చి యిచ్చు టిదియును నిజమే. 90

ఈమాటే గుఱి సేయుఁడి
యేమాటలకుం జనేమి యిఁక నావుడు న

జామాతమాటలకు వే
శ్యామాత సరోష చేత యై యిట్లనియెన్. 91

తే. రంగఁ డను పేరుసైతమెఱుంగఁ జెప్పి
యవ్వఁడుగు శిష్యుఁడను నే నటంచు వచ్చి
నతనిఁ గడుఁ గట్టిచేసెను ననువుదోఁగ
కేది గుఱి కల్లతో నిజ మెట్లు దోఁచు. 92

క. తనవంటిపిల్లసికయే
తనకుం బలెఁ దులసిపేర్లు తనవలెనే చాఁ
దినతిరునామము రూ పీ
తనివంటి దొకింత నలు పతం డరయంగన్. 93

చ. వడి నదలించినం బడుచువాఁడు భయంపడి యేడఁజెప్పునో
తొడిఁబడ నంచు వాని నిటఁ దోడ్కొని తేరక తానె వచ్చి
యీ, గడుసరిదోఁగ మమ్మొడియఁ గట్టెడు శిష్యుఁడు లేఁ
డటంచు మున్, గుడికడ దుష్టముల్పలుక గొండొకశోధన
దీని కెమ్మెయిన్. 94

చ. తెఱవల మే మెఱుంగుదుమె తెల్లని వెల్లను బాలటందు మి
ట్లరయక వేడ్కకాఁ డగుచు నక్కట యీగొఱగామిచే
మముం, జెఱుప నుపాయ మెంచి యిలు చేర్చెను దేవర
సొమ్ముఁ దెచ్చి యీ, యఱవకువాళి యింత యురి యూ
నని కానక మోసపోయితిన్. 95

క. అని యిట్లు దేవదేవి
జననీవాక్యములు విప్రసత్తముఁ డపు డా

డినమాటలు విని విప్ర
జ్జనములు నజ్జయ్య ధర్మసభఁ జూర్పించెన్. 96

వ. ఇట్లు గూడినవిప్రక్షభాజనులు గొందఱు విప్రనారాయ
ణుం గనుంగొని. 97

చ. వటుఁడవై యగ్రజన్ముఁడవై వైష్ణవుఁడై నవై తాను గ్ర
మ్మఱ, న్విటుఁడవై దేవతాధనము వేశ్యకు మ్రుచ్చిలి యిచ్చి
నాఁడవే, యిటువలె నౌనె భ్రష్టుఁడు హరీ! జగదీశ్వర!
రంగరంగ! యీ, కుటిలునిచేఁత వైష్ణవులకుం దలవంపులు
చేసె దిక్కులన్. 98

మ. అభియాతు ల్గొడలీమతంబునకు మాయావాదు లాత్మీయదు
ర్వ్యభిచారం బదిమేరువం తయినమాయ న్మిథ్య లేదంద్రు పె
ల్లభియోగింపుదు రన్యదుష్కృతము గోరంతైనఁ గొండంత
గాఁ, బ్రభువుల్ హాస్యరసప్రియు ల్మనల నీపాలైన మ
న్నింతురే. 99

వ. అని యిట్లు హరిదాసు లయినశ్రీవైష్ణవజనంబులు మనం
బుల ఘనం బగుఖేదంబు లొందుచుండ నవ్వేల నితర
మతంబులవా రతని నుద్దేశించి. 100

ఉ. చోరుఁ డనంగ రా దొరులసొమ్ములు మ్రుచ్చిలినం బ్రస
న్నునిఁ, జారుఁ డనంగ రాదు పెలుచం బరకాంతలఁ
గూడ వీఁ డనా, చారుఁ డనంగఁ గూడ దనిశంబును వే
శ్యలతో రమించినం, బోరన మీర లీతనికిఁ బూనుఁడు
బ్రహ్మారథంబు వైష్ణవుల్. 101

వ. అని సోల్లుంఠనము లాడుచుండి రాసమయంబున జియ్యరు సభాసదుల కిట్లనియె. 102

తే. పరఁగ దేవరసొమ్ము దేవరకుఁ జేరె
దొంగ యెటు వోయె నేమి యనంగఁ జెల్ల
దరసి శిక్షింప కుండిన నాత్మ పదిల
పడదు గావున న్ముచ్చు నేర్పఱుపవలయు. 103

—సభాసదులు విప్రనారాయణునకు శిక్షవిధించుట—

వ. అని మఱియు వేశ్యాంబపలుకులును, విప్రనారాయణు వాక్యంబులును సభాంతరంబున సవిస్తారంబుగా వారలకుం దెలిపి ధర్మంబు లెట్లుండు ననిన వారలు దమలోన. 104

తే. పెట్టలే దని తర్కించునట్టివిటుని
వేశ్య లూరక పిల్తురే విత్త మీక
హేమపాత్రికఁ జూచి కాకితనిపట్టె
నామములు చూచి పిలిపించినారె మరల. 105

క. ఏఁడాదిబట్టి వేదుక
కాఁడై యితఁ డింట నుండెఁ గాని యితరుఁ డే
వాఁడు న్లేఁ డని యీపూఁ
బోఁడి యనియె నితఁడు నట్లు పొందుగఁ జెప్పెన్. 106

క. ఈయర్థంబున గిన్నియ
నీయన యీవలయుఁ గాని యితరులకు వృథా
రో యిడఁ బ నేమి యదవద
నేయక యిది ధర్మమని వచింపుఁడు పెద్దల్. 107

తే. ఎవ్వ రేనియుఁ గొనిపోయి యూక గిన్న
నడిచి పోవను వారింటికడకుఁ దాన
యొరులు గొనిపోయి యొసఁగఁ బ్రయోజనంబు
గలుగ దటుగాన నీతఁ డీవలయు దీని. 109

ఉ. కొంచక రేయునుం బవలుఁ గోవెల కీతఁడు పువ్వుదండ ల
ర్పించు నెపంబునం బరిచరింపుచు నుండినటుండి యొయ్య నే
పంచను బొంచి యర్చకులు వద్దఁ దొలంగినసందుఁ జూచి లం
కించఁగ నోవు నీపసిఁడిగిన్నియ సంశయ మేల దీనికిన్.

వ. అని నిశ్చయించి యవ్విప్రనారాయణునందుఁ జోరత్వం
బాపాదించి సభాసదు లందఱు నేకత్వంబున నత్తెఱంగు
జియ్యకెఱింగించిన విని యతండు దీనికిం దగుశాస్త్రి యె
ట్లుండు ననిన వార లి ట్లనిరి. 110

ఆ. ధనముఁ గొనుటయొండెఁ దల గొఱుగుట యొండె
నాలయంబు వెడల నడుచు టొండెఁ
గాని చంపఁ దగినకార్యంబుఁ జేసినఁ
జంపఁ దగదు విప్రజాతిఁ బతికి. 111

క. అని విజ్ఞానేశ్వరునివ
చన మున్నది గాన నట్టిశాస్త్రి యొకటి యీ
యన కొనరింపం దగు న
య్యనువునఁ జేయించి పంప నగు నొండెడకున్. 112

ఆ. ధనము నెరయ లేదు తల మున్న గొఱిగించు
కొన్నవాఁడు గాన నున్నతలఁపు

లుడిగి క్షేమ వెడల నడచుటె శాస్త్రోక్త
రీతి యితని కట్లు సేయుఁ డనుచు. 113

శా. ఈమాడ్కి న్నుడిజియ్యతోడ సభవారేణోక్తిగా నాడఁగా
నామాటల్విను చున్నవప్రవదనుండై విప్రనారాయణుం
డీమే నేటికి దొంగనై చనిన యన్యాయ్యవ్రు మన్నింతు నీ
శ్రీమత్సిద్ధుఁడ నాదు దేహము విసర్జింతు న్హరిప్రీతిగన్.

క. అని యిట్లు తనుత్యాగంబునకుఁ గృతనిశ్చయుం డై. 115

సీ. అరియు శీతాంశుసోదరియును నజుఁడును
వాలు నిల్లాలుఁ దొల్చూలు నగుచు
హరుఁడు నండజకులేశ్వరుఁడు సాగరుఁడును,
దేహంబు వాహంబు గేహ మగుచు
నరుఁడు కంసకులనూదరుఁడును మరుఁడును,
మిత్త్రుండు శత్త్రుండు పుత్త్రుఁ డగుచు
హేమంబు శిఖిపింఛదామంబు నామంబుఁ,
బొంబట్టుఁ దలచుట్టు బొట్టు నగుచుఁ
తే. గౌస్తుభమణీవరంబు కంగాభరంబుఁ
గెంపుపతకంబుఁ బొదంపుసొంపు నగుచు
వెలయు నే దేవుఁ డా దేవు నిలిపె నాత్మ
రంగనాథుఁ ద్రిలోకాంతరంగనాథు. 116

వ. ఆసమయంబున. 117

—శ్రీరంగనాథుఁడు సభకు వేంచేయుట.—

సీ. నికటాక్షశశిభాను లోకట సహస్ర మహా,
కరముల శంఖచక్రములు మెఱయ

శ్రీకాంత వక్షస్స్థలీకౌస్తుభంబున,
బంగారుప్రతిమఁ నా బ్రతిఫలింప
ఛత్త్రాయమాణశేషఫణామణిప్రభ,
దిననాథదీప్తులఁ బోనుగుపఱుప
వాయుభక్షులు మునీశ్వరులు సురలు సంఘీ9,
సరసిజమ్ములపైని శిరసు లొగ్గ
తే.. వాస వానల యమ దైత్య వరుణ వాయు
వైశ్రవణ శర్వ గీర్వాణవరులు గొలువఁ
గరుణఁ బ్రత్యక్ష మయ్యె భక్తవ్రజాంత
రంగవాంఛాప్రదాయి శ్రీరంగశాయి. 118

సీ. రభటిల్లుదివ్యదుందుభినినాదంబులు,
గంభీరగర్జావిజృంభణముగ
నటియించు నప్సరఃకుటిలాలకావళీ,
ప్రచురవిద్యుల్లయానిచయముగను
ప్రసరించు దేవతావిసరరత్నవిభూష,
లమరేంద్రచాపవిభ్రమములుగను
వడిరాలు పూఁదేనెజడివానసోనలు,
ధారాళధారాంబుపూరముగను
తే. విప్రనారాయణాత్మభూమిప్రవృద్ధ
వేదనాగ్రీష్మసంతాపనోదనముగ
మెలఁగునంబరచరు లనుమేఘతతులు
గురిసె నప్పుడు మందారకుసుమవృష్టి. 119

వ. అంత నవ్విప్రనారాయణుం డాదినారాయణు దివ్యమంగళ
విగ్రహంబు లోచనానందంబుగా సందర్శించి రోమాంచ
కంచుకితసర్వాంగుం డై సాష్టాంగదండప్రణామం బాచ
రించి కేలుదోయి ఫాలభాగంబునం గీలించి. 120

సీ. సతతత్రయీశిఖాచరణాయ శరణాయ,
పావనాయ సురాధిపావనాయ
హరిదశ్వరజనీకృదక్షాయ దక్షాయ,
శంకరాయ నిజాప్తశంకరాయ
సనకాదిహృదయరంజనకాయ జనకాయ,
నాయకాయ గిరీశసాయకాయ
హేలాశయనకాశనేశాయ నేశాయ,
కారణాయ సదాఘవారణాయ
తే. దేవ! రంగేశ! తే నమస్తే నమోస్తు
దేవ! మాం పాహి పాహి త్వమేవ శరణ
మన్యదైవం వినా త్వా మహం న వేద్మి,
సర్వసాక్షీ భవాన్ సమస్తమపి వేత్తి. 121

క. కుధరధనుర్ధరముఖ్యవి
బుధరాజస్తుత్య! మిమ్ముఁ బొగడ నవిద్యా
త్మధరుండ నసమర్థుఁడ నే
నధరస్పందన నొనర్ప నఖిలాధీశా! 122

క. నాపయిని దేవతావి
త్తాపహారణనిందప్రాప్తమైనది దీనిం

బాపి విమలాత్ముఁ జేయు ద
యాపర! లక్ష్మీశ! త్రిభువనైకనివేశా!. 123

వ. అనిన నద్దేవుండు కోవెలపారుపత్తెంబున నధికారి యైన జియ్యరున కిట్లనియె. 124

క. లీలావినోదమునకై
యీలాగున నేను పేరి నిరువురి రతిరా
ట్కేళిం గూర్చితి మద్వన
మాలిక యితఁ డప్సరగప్రమద యీసతియున్. 125

క. కోవెలకు నేన యిచ్చితి
నీ వెలఁదికి గిన్న వేశ్య కిచ్చిన యది గై
కోవచ్చునె మరలఁ గ నా
యీవికిఁ దిరుగందుఁ గలదె యిండది మరలన్. 126

వ. అని యాన తిచ్చి సకలజనులు గనుంగొన నయ్యాది నారాయణుండు విప్రనారాయణుశరీరంబునఁ బ్రవేశించె నందుల కాశ్చర్యధుర్యులై యఖిలజనంబు లతని కత్యంత భయభక్తివినయసంభ్రమంబులం బునఃపునరభివందనంబు లాచరించి రంత. 127

తే. బ్రహ్మసభ యెల్ల భక్తి నప్పరమవైష్ణ
వోత్తముని బ్రహ్మరథమున నునిచి పట్ట
ణమున కేతెంచి రధికసంభ్రమము మీఱ
జియ్య ముందఱికొమ్మునఁ జేరి మోవ. 128

తే. ఇవ్విధంబునఁ బట్టణం బేగి రంగ
ధాముసన్నిధి కరిగి యతండు దండ

వత్ప్రీణామంబు లిడి తిరువాయిముడి ప్ర
బంధసూక్తుల వినుతు లర్పణ మొనర్చి. 129

శా. ఆరూఢాత్మనయోమదాంధతను శంకాతంకముల్ లేక స్వే
చ్ఛారీతి న్గడు నే నొనర్చినయనాచారంబు లోఁగొంటి నీ
కారుణ్యంబున కేది మేర యని వక్కాణింతు రంగేశ! యో
శ్రీరంగేశ్వర! శాశ్వతశ్రుతిశిరస్సింహాసనాధీశ్వరా! 130

శా. శ్రీరంగత్కుచకుంభపాళిశిఖరోచిర్మండలిఁ దుగ్ధపా
థోరాశిఁ దులసీవనంబునఁ ద్రిపాద్భూతిఁ బలెన్ మన్మనో
గాఢాప్తి న్వసియించి సంసరణదుఃఖంబు న్నివారింపు మో
శ్రీరంగేశ్వర! శాశ్వతశ్రుతిశిరస్సింహాసనాధీశ్వరా! 131

వ. అనుచు సన్నుతించినఁ బునః ప్రసన్నుండై యతండు కోరిన
యట్ల యొసంగి యద్దేవదేవుం డిట్లనియె. 132

క. వనజభవవంశవర్ధన
ఘనమగునీపువ్వుమాలికాకైంకర్యం
బున నీకుఁ గల్గు సంతత
మును మత్సామీప్యపదవి ముల్లోకములన్. 133

మ. వసుధ న్నామకగోపికాజనరతివ్యాపార మేలీల వే
దసమం బై వెలసెం దదీయసరణిం ద్వత్పుణ్యచారిత్రమున్
దెసలం బ్రస్తుతి కెక్కు దీని వినినన్ విన్పించినన్ వ్రాసినన్
రసనం బేర్కొనఁ గన్నవారలకు మద్రాజ్యంబు నే నిచ్చెదన్.

~ శ్రీరంగనాథునిచే విప్రనారాయణుఁడాళ్వారగుట ~

తే. అనఘ! తొండరడిప్పొడి యనఁగఁ బరఁగు
నీకు నాళ్వారిపేరు నౌఁగాక యనియె
నతఁడు తొండరడిప్పొడి యాళువార
లనఁగఁ బ్రఖ్యాతిఁ జెలు వొందె నవనియందు. 135

తే. జియ్యరును దేవదేవికి నెయ్య మెసఁగ
విహితవస్త్రాభరణసమన్వితము గాఁగఁ
గనకపాత్ర సమర్పించి యనుపుటయును
నత్తలిరుఁబోఁడియు విరక్తచిత్త యగుచు. 136

క. పెరుమాళ్లకు నాగిన్నియ
యిరుమడుగులపసిఁడి గాన్క యిడి తన కిదియే
తిరువారాధనగాఁ గొని
సిరివరు రంగేశ్వరుని భజింపుచు నుండెన్. 137

ఉ. న్యాయగుణప్రదీపన వనచ్ఛవిలజ్జితభారతీభవా
వ్యాయతనవ్యదేహ చరణాబ్జకృతార్థితతద్విదేహ య
త్యాయతబాహుదండ విహితావహచండ సుబాహుదండ
గా, ధేయమఖాధ్వరక్షణ సుధీజనబోధనయాధ్వరక్షణా.

క. దశరథరాజపురాజ
న్మశతకృతాగణ్యపుణ్యమందారఫలా
స్వశరీరచాపటంకా
రశరద్గర్జాజితేంద్ర రాజమృగేంద్రా. 139

సుగంధి వృత్తము.

పాదపాంసుపాలితాక్ష పాదదారవేదనా
వేదనాతదీయతాభి వేద్యభృత్సనాదితా
నాదితాంగజారిచాప నాథవేదిజాలకా
వేదిజాలకాంక్షితాభి వృద్ధకల్పపాదపా. 140

గద్యము. ఇది శ్రీమదాపస్తంబసూత్ర భారద్వాజగోత్రపవిత్ర శ్రీరామచంద్ర కరుణాతరంగితవైభవ సారంగు నృసింహ మంత్రితనూభవ పరిచిత భగవద్భాగవతకైంకర్య విధాన తమ్మయాభిధానప్రణీతంబైన వైజయంతీవిలాసంబనుమహాప్రబంధంబునందు సర్వంబును జతుర్థాశ్వాసము.

వైజయంతీవిలాసము సంపూర్ణము.

---



---

చెన్నపురి: 'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము—1924.

# ఆంధ్ర గ్రంథములు.

---

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| అచ్చతెనుఁగురామాయణము, శుద్ధప్రతి .... | 1 | 4 |
| అనంతునిఛందము, ఛందోదర్పణము .... | 0 | 14 |
| అనిరుద్ధచరిత్రము, కనుపర్తిఅబ్బయామాత్యప్రణీతము | 0 | 8 |
| అప్పకవీయము, నూతనముద్రితము .... | 2 | 8 |
| ,, విమర్శనమాత్రము .... | 0 | 8 |
| అంబరీషోపాఖ్యానము, సటీక (భాగవతము) .... | 0 | 4 |
| ఆముక్తమాల్యద, వావిళ్ల. రామస్వామిశాస్త్రిగారి వ్యాఖ్యానముతో మేలుకాకితములమీఁద చక్కఁగ మరల ముద్రించియున్నారము ... | 3 | 8 |
| ఆంజనేయదండకము, హనుమద్దండకము .... | 0 | 2 |
| ఆంధ్రభాగవతము, పోతనామాత్యప్రణీతము, ఇదివరకు ముద్రితమైనప్రతులకన్న అన్నివిధములబాగుగనున్నది | 6 | 0 |
| డిటో అత్యుత్తమప్రతి, రెండుసంపుటములు | 8 | 0 |
| శ్రీమదాంధ్రభారతము-పద్యకావ్యము:— | | |
| 7 సంపుటముల ప్రతి 1-కి. రూ. | 15 | 12 |
| 3 సంపుటములప్రతి .... | 15 | 0 |
| ఆది, సభాపర్వములుగల సంపుటము .... | 2 | 4 |
| ఆరణ్యపర్వము ,, .... | 2 | 4 |
| విరాటోద్యోగపర్వములు ,, .... | 2 | 4 |
| భీష్మద్రోణపర్వములుగల సంపుటము .... | 2 | 4 |
| కర్ణశల్యసౌప్తిక స్త్రీపర్వములు .... | 2 | 4 |
| శాంతిపర్వము .... | 2 | 4 |

| | ప్రతి 1-కి రూపా. | అ. |
|---|---|---|
| ఆనుశాసనిక, అశ్వమేధ, ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక, స్వర్గారోహణపర్వములుగల సంపుటము | 2 | 4 |
| ఆదిపంచకము, ఒకటేసంపుటము .... | 6 | 8 |
| యుద్ధపంచకము ,, .... | 4 | 4 |
| శాంతిసప్తకము ,, .... | 4 | 4 |
| ఆంధ్రభారతవిమర్శనము, మల్లాదిసూర్యనారాయణశాస్త్రి | 0 | 8 |
| ఆంధ్రరామాయణము, 2 సంపుటములు .... | 8 | 0 |
| ఆంధ్రశ్రీమద్రామాయణము, కావ్యతీర్థ. జనమంచి శేషాద్రిశర్మకృతము, 3 సంపుటములు .... | 12 | 0 |
| ఆంధ్రబ్రహ్మాండపురాణము .... | 5 | 0 |
| ఆంధ్రలలితోపాఖ్యానము .... | 1 | 8 |
| ఆంధ్రభాషాభూషణము .... | 0 | 2 |
| ఆంధ్రభాషార్ణవము, అట్టబైండు ... | 0 | 12 |
| ,, కాలికోబైండు .... | 1 | 2 |
| ఆంధ్రనామసంగ్రహము, ఆంధ్రనామశేషము, సాంబనిఘంటువు, టీకానుక్రమణికాసహితము .... | 0 | 12 |
| డిటో కాలికోబైండు .... | 1 | 0 |
| ఆంధ్రచంద్రాలోకము, సటీక .... | 0 | 8 |
| ఉత్తరరామాయణము, కంకంటిపాపరాజప్రణీతము చక్కనికూర్పు .... | 2 | 4 |
| ఉత్తరహరివంశము, నాచనసోమనాథకృతము | 1 | 8 |
| కవికర్ణరసాయనము, మాంధాతచరిత్ర ... | 1 | 8 |
| కవిరాజమనోరంజనము .... | 0 | 12 |
| కవిజనాశ్రయము, భీమునిఛందస్సు .... | 0 | 12 |
| కళాపూర్ణోదయము, దళసరికాకితములు .... | 2 | 4 |

| ప్రతి. 1-కి | రూ॥ | అ. |
|---|---|---|
| కాశీఖండము, చక్కనిక్రొత్తకూర్పు .... | 1 | 8 |
| కుచేలోపాఖ్యానము, సటీక, (భాగవతము) .... | 0 | 4 |
| డిటో గట్టుప్రభుకృతము ... | 0 | 6 |
| కృష్ణరాయవిజయము, కుమారధూర్జటికృతము | 0 | 8 |
| గజేంద్రమోక్షము, సటీక, చక్కనికూర్పు ... | 0 | 8 |
| గోపీనాథరామాయణము, 2 సంపుటములు, శ్రీమద్రామాయణమునకు సరియైనపద్యము, కవనముమిక్కిలి సొంపు, పీఠిక అతివిపులము .... | 7 | 8 |
| చంద్రరేఖావిలాపము, కూచిమంచి జగ్గకవిది | 0 | 14 |
| చాటుపద్యమణిమంజరి, క్రొత్తకూర్పు, ప్రథమభాగము | 1 | 4 |
| డిటో రెండవభాగము, సాధారణప్రతి | 1 | 6 |
| డిటో మేలుప్రతి, గ్లేజుకాకితములది | 1 | 10 |
| చెన్నబసవపురాణము, పాపకవికృతము .... | 1 | 2 |
| జైమినిభారతము, అశ్వమేధపర్వము, చక్కనికూర్పు | 1 | 0 |
| డిటో కాలికోబైండు .... | 1 | 6 |
| తారాశశాంకవిజయము, చక్కనికూర్పు .... | 0 | 12 |
| తెనుఁగుసమస్యలు .... | 0 | 2 |
| దసరాపద్యములు .... | 0 | 2 |
| నరసభూపాలీయము, అట్టబైండు .... | 0 | 10 |
| నలోపాఖ్యానము, సటీక, చిన్నసైజు .... | 0 | 8 |
| నలచరిత్ర, ద్విపద .... | 0 | 14 |
| నిర్వచనోత్తరరామాయణము, సాధారణప్రతి | 0 | 12 |
| నిరంకుశోపాఖ్యానము, రుద్రకవికృతము .... | 0 | 6 |
| నీలాసుందరీపరిణయము, కూచిమంచి తిమ్మకవికృతము | 0 | 4 |
| నృసింహపురాణము, ఎఱ్ఱాప్రగడ, క్రొత్తకూర్పు | 1 | 0 |

| | ప్రతి. 1-కి రూ॥. | అ. |
|---|---|---|
| పంచతంత్రము, నారాయణకవికృతము .... | 0 | 12 |
| పారిజాతాపహరణము, మేలుకాగితములు, చిన్నసైజు | 0 | 8 |
| బసవపురాణము, పిడుపర్తిసోమనాథప్రణీతము | 2 | 4 |
| బ్రహ్మోత్తరఖండము .... | 1 | 0 |
| బిల్హణీయము, చక్కనికూర్పు .... | 0 | 8 |
| భగవద్గీతలు, నత్తోజీపండితవిరచితము ... | 0 | 8 |
| భాస్కరరామాయణము, చక్కనిక్రొత్తకూర్పు | 4 | 0 |
| భోజరాజీయము, అనంతామాత్యకృతము .... | 1 | 2 |
| భోగినీదండకము .... | 0 | [illegible] |
| మనుచరిత్ర, సటీక, వావిళ్ల. రామస్వామిశాస్త్రిగారి వ్యాఖ్యానముతో చిన్నసైజున మేలుకాగితముల మీఁద స్ఫుటమైన అక్షరములతో చక్కగ ముద్రించియున్నారము. .... | 2 | 0 |
| మొల్లరామాయణము, చిన్నసైజు, పెద్దక్షరములు | 0 | 10 |
| రసికజనమనోభిరామము ... | 0 | 12 |
| రంగనాథరామాయణము, ద్విపద, చక్కనిక్రొత్తకూర్పు | 3 | 8 |
| రంగరాయచరిత్ర, దిట్టకవినారాయణకవిప్రణీతము | 0 | 8 |
| రాఘవపాండవీయము, సటీక, చక్కనికూర్పు | 2 | 4 |
| రాజశేఖరవిలాసము ... | 0 | 8 |
| రామరాజీయము, చక్కనిప్రతి, మేలుకాగితములు | 1 | 12 |
| రామాభ్యుదయము, అయ్యలరాజు రామభద్రకవిది | 1 | 4 |
| రుక్మిణీకల్యాణము, సటీక, చక్కనిప్రతి .... | 0 | 8 |
| రుక్మిణీపరిణయము, శుద్ధప్రతి .... | 0 | 4 |
| రుక్మాంగదచరిత్ర, ఏకాదశీమాహాత్మ్యము .... | 0 | 10 |

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| యాపలి, రాజపుత్ర స్త్రీ సాహసపుకథ శ్రీ ఎనమండ్ర నారాయణమూర్తిగారిది | 0 | 8 |
| లంకావిజయము (రావణదమ్మీయము), సటీక, పిండి ప్రోలు లక్ష్మణకవికృతము .... | 1 | 4 |
| వసుచరిత్ర విమర్శనము, శ్రీ చినసీతారామస్వామి శాస్త్రికృతము, అత్యద్భుతములగు క్రొత్తవిషయము లనేకము లిందుగలవు .... | 1 | 0 |
| వసుచరిత్ర, సవ్యాఖ్యానము, చక్కనికూర్పు | 3 | 8 |
| విక్రమార్కచరిత్ర, జక్కనకవిప్రణీతము ... | 1 | 4 |
| విజయవిలాసము, చేమకూర వేంకటకవికృతము | 0 | 8 |
| విదురనీతి, సటీక, ఆంధ్రభారతములోనిది .... | 0 | 5 |
| వేంకటాచలమాహాత్మ్యము, తరిగొండ వెంకమ్మది | 1 | 0 |
| వేమనపద్యములు, చక్కనికూర్పు ... | 0 | 6 |
| డిటో బ్రౌనుదొరగారి ఇంగ్లీషుతో .... | 1 | 4 |
| డిటో (3060) ఆంధ్రతాత్పర్యముతో .... | 3 | 8 |
| వైజయంతీవిలాసము, చక్కనికూర్పు .... | 0 | 8 |
| శకుంతలాపరిణయము, కృష్ణకవికృతము .... | 0 | 12 |
| శశిరేఖాపరిణయము, అప్పప్పకవికృతము .... | 0 | 12 |
| శివలీలావిలాసము, కూచిమంచి తిమ్మకవిప్రణీతము | 0 | 6 |
| శ్రీనాథునివీథినాటకము .... | 0 | 2 |
| శృంగారనైషధము, శ్రీనాథకవిది, క్రొత్తకూర్పు | 1 | 0 |
| సకలజనమనోరంజనము .... | 0 | 12 |
| సప్తమస్కంధము, సాధారణప్రతి (భాగవతము) | 0 | 6 |
| సారంగధరచరిత్రము, చేమకూర. వేంకటకవికృతము | 0 | 10 |
| సానందోపాఖ్యానము, శ్రీశివరామకవి విరచితము | 1 | 0 |

